

భారత ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూ జన్మదినోత్సవం యీ నెల 14వ తేది యావద్భారతంలో ముఖ్యంగా బాలలకు మహాపర్వము. ఇది తన తండ్రి శ్రీ పండిత మోతిలాల్ నెహ్రూతో తీసిన చిన్ననాటి చిత్రము.




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

---

# రాజ్యాంగము — ప్రజలు



దేశం యొక్క ప్రపంచము యొక్క శాంతి సౌభాగ్యాలకు, అభివృద్ధి అభ్యుదయాలకు ఏ దేశపు రాజ్యాంగములోనైనా పౌర బాధ్యతల నిర్వచనము అత్యవసరము. ప్రజలు హక్కులకు, అవకాశములకు ప్రాకులాడుతూ బాధ్యతలను విస్మరించడము అవాంఛనీయ పరిణామాలకు దారి తీయగలదు.

ఈ నాడు ప్రపంచము మొత్తముమీద స్వార్థము, అధికార ఆధిపత్యవాంఛలు దుర్మార్గము ప్రబలుచుండుటకు కారణము ప్రజలు తమ బాధ్యతలను విస్మరించుటయనియే చెప్పవలెను. రాజ్యాంగము పౌరధర్మాలను నిర్వచించుటవలన ప్రజలు మరింత బాధ్యతాయుతులు కాగలరు. మంచి చెడ్డలవిచక్షణాజ్ఞానము యిప్పటికంటె మేలైన స్థాయిలో నుండి ప్రజలు తమ హక్కులకు, అవకాశములకు పరిమితులను గుర్తించి సంఘ శ్రేయస్సునుద్దేశించి మెలగుతారు. కాబట్టి ముఖ్యంగా మన రాష్ట్రపతి డా॥ రాజేంద్ర

ప్రసాద్ చెప్పినట్లు మనరాజ్యాంగంలో పౌరబాధ్యతల నిర్వచనం జరిగితీరాలి. అది లేకపోవడం యీనాడు ప్రజలమనస్తత్వాలలోని లోపాలకు కారణమని రూఢిగుద్ది చెప్పవచ్చును.

ఈనాడు దేశం మొత్తంమీద ప్రజలలో బాధ్యతారహితమైన దృక్పథం కనుపిస్తున్నది. తమ హక్కులు, అవకాశములు న్యాయమైనవయినా కాకపోయినా వానికి భిన్నము ఏర్పడినప్పుడు ఆందోళన చెందుచున్నారు. బాధ్యతలను విస్మరించి స్వార్థానికి ప్రాధాన్యమిస్తూ ఉమ్మడి శ్రేయస్సును నిర్లక్ష్యము చేస్తున్నారు. పౌరధర్మాల నిర్వహణావశ్యకత ఏర్పడినప్పుడు ఎవరిమటుకు వారు తప్పించుకోడానికి ప్రయత్నము జరుగుతున్నది. మొత్తంమీద ప్రజలలో ఏ వర్గంలోను చిత్తశుద్ధి, నిజాయితీ, సద్భావము, వాస్తవిక పరిజ్ఞానము లేదనడం సాహసంకానేరదు. ఏ దేశమైనా అభివృద్ధి అభ్యుదయాలను సాధించాలంటే యివి పునాదులు కావాలి!

సాంఘిక పరిస్థితులను పరజూచినచో యీ నాడు తల్లిదండ్రుల బిడ్డలమధ్య, భార్యాభర్తలమధ్య, సోదరీ సోదరుల మధ్య, యజమాని శ్రామికుల మధ్య సత్సంబంధాలు, సద్భావము, ప్రేమానురాగాలు, సానుభూతి నీరసించి పోతున్నవని చెప్పాలి. దాని ఫలితంగా కుటుంబజీవితం సుఖసౌభాగ్యాలను కోల్పోవుతున్నది. పరస్పర ద్వేషం, అసూయ, అఘాయిత్యం, స్వార్థం విపరీతంగా పెరిగిపోతున్నవి. ఇందుకు కారణం సంఘంలోని వారు తమ ధర్మాలను ఆసక్తితో ఆచరించ విముఖులగుచుండుటయని చెప్పాలి.

మన వ్యవసాయ, వర్తకవ్యాపార, పారిశ్రామికరంగాలలో యీనాటి క్లిష్ట పరిణామాలు ప్రజలలో బాధ్యతారాహిత్యాన్నే సూచిస్తున్నవి.

వ్యవసాయరంగంలోను, పారిశ్రామికరంగంలో నుత్పత్తిదారులకు వలసిన అవసరాలు, అవకాశాలు అమరినా వారి ఉత్పత్తులను సరసమైనధరలకు, పరిమితలాభాలతో అమ్మనిచ్ఛగించుటలేదు. అధికలాభాల ఆపేక్షతో నిత్యప్రజావసరాలను నిర్లక్ష్యం చేస్తూ ధరవరలు పెరుగుదలకు కారకులగుట ముమ్మాటికి బాధ్యతారహితమేనని చెప్పాలి. ఉత్పత్తులు పెరిగినా, ప్రజలు తమ ఆదాయం పెరుగక పెచ్చుపెరిగిపోతున్న నిత్యావసరాల ధరల మూలంగా గిజగిజలాడిపోతున్నారంటే దానికి ప్రతియొక్క భారతీయుడు తన ధర్మాలను పౌరుడుగా విస్మరించుటయే కారణము. ఉత్పత్తిదారులు, వినియోగదారులు బాధ్యతతో వ్యవహరించి పరస్పర సద్భావ, సానుభూతులతో తమ అవకాశాలను, హక్కులను ప్రభుత్వదృష్టికి తేవలసియున్నది. అప్పుడు ప్రభుత్వము సయితము వానిని గుర్తించి సమకూర్చకతప్పదు.

వర్తకవ్యాపారరంగాలలో వినియోగదారుల శ్రేయస్సు మరింతగా విస్మరించబడుతున్నది. నమ్మకం, నిజాయితీ బొత్తిగా నీరసించి పోయినవి. పరిమితిలేని లాభాపేక్ష

మోసాన్ని ప్రోత్సహిస్తున్నది; ఆహారపదార్థాలలో కల్తీ, చీకటి మార్కెట్టు, ధరవరల పెరుగుదల సర్వసాధారణమయి ఏక్షణానిక్షణం సామాన్యప్రజల జీవితమును దుర్భరము చేస్తున్నవి.

నాణ్యంలోకాని, కొలతలలోకాని నమ్మి బజారులో ఏవస్తువును కొనజాలని పరిస్థితులు ఏర్పడినవి. నిత్యావసరాలు అహారం, గుడ్డలాంటి వాని విషయంలో వ్యాపారులు అవలంబించే వైఖరి పౌరధర్మాలకు విరుద్ధమైనది.

ఇక పారిశ్రామిక రంగం చూద్దామా అంటే యజమానులు, శ్రామికులు విభిన్న మార్గాలలో నడుస్తున్నారు. శ్రామికులునిరంతరము హక్కుల అవకాశాల విస్తరణకు ఆందోళన చేయువారేకాని చిత్తశుద్ధితో తమ బాధ్యతలను నిర్వహించేవారు బహు కొద్దిమంది. ఇక యజమానులు తమకు లక్షలు, వేలు ఆదాయం వస్తున్నా శ్రామికుల అభివృద్ధి అభ్యుదయాలకు తగురీతిగా తోడ్పడడం అరుదుగానున్నది. తత్ఫలితంగా పరస్పర ద్వేషం; అసూయ, కలవరం ప్రబలి అశాంతికరమైన పరిస్థితులు ఏర్పడడానికి కారణం పౌరులుగా ఆ యిరువర్గాలు బాధ్యలను విస్మరించుటయని వేరు చెప్పనవసరముండదు.

ప్రజలలో పెచ్చుపెరిగిపోతున్న అవినీతికి, లంచగొండితనానికి, అఘాయిత్యానికికూడ ప్రజలలో బాధ్యతారాహిత్యమే కారణము. ప్రజలు తమ ధర్మాలను గుర్తించి ఉమ్మడి శ్రేయస్సే తమ యొక్క, తమదేశంయొక్క శ్రేయస్సని గుర్తించకలుగుట కనువుగా రాజ్యాంగంలో పౌర ధర్మాల నిర్వచనం పొందుపరచబడాలి. అనాడే ప్రజలలో విశాలదృక్పథం ఏర్పడి నైతికస్థాయి ఉన్నతముకాగలదు. వాస్తవిక పరిజ్ఞానం పెంపొంది నీతి నియమాలకు ప్రజలు బద్ధులుకాగలరు. ప్రజలలో స్వార్థము, అఘాయిత్యము, అధికార ఆధిపత్య వాంఛలు అంతరించగలవు. ఇట్టి పరిణామాలు ప్రజలలో పరస్పరవిశ్వాసం, ప్రేమానురాగాలు, సహాయసహకారాలు పెంపొందడానికి తోడ్పడగలవు. సేవాత్యాగాలకు సయితం పౌరధర్మాల అనుసరణ మార్గదర్శకంకాగలదు. వీనిని చిత్తశుద్ధి వెన్నంటి యుంటుందని వేరుగా చెప్పనవసరముండదు.

ఈనాటి జీవితమందలి నిరాశనిస్పృహలకు, పేరాశకు, అహంకారమునకు, భయసందేహాలకు, ద్వేషానికి రాజ్యాంగంలో పౌరధర్మాల నిర్వచనం ముమ్మాటికి విరుగుడుకాగలదు. సుస్థిరమైన శాంతి సౌభాగ్యాలు యింటబయటకూడ నమరగలవు. ఇట్టి పౌరధర్మాల నిర్వచనం ఏక్షణానిక్షణం పౌరబాధ్యతల పట్ల ఆసక్తిలేనివారు హక్కులు, అవకాశములకు యోగ్యులుకారని ప్రబోధించాలి. ఆ ప్రబోధం ప్రజల ఆత్మపరిశీలనకు తోడ్పడి ఉత్సాహపరచి ఆత్మవిశ్వాసాన్ని కలిగించి ముందుకు నడుపాలి!

---

# త్రాగుబోతు

జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ



## I

కారు ఎంతో వేగంతో హోటలు పరిసరాల నుంచి వెడుతూవుంది. మా వూరికి వెడుతానికి దగ్గర దోవ వుంది. నన్ను కారులో కూర్చోబెట్టాక మా డాక్టర్ మాన్స్‌ఫీల్డ్‌కు ఏం తట్టిందో ఆ దగ్గరదోవను తప్పించి చుట్టుదోవన కారును నడిపిస్తూ వున్నాడు. ఆయన ప్రక్కనే మావూరి పెద్ద డాక్టరు కూర్చున్నాడు. వాళ్ళకు వెనుకనున్న స్థలంలో కూర్చున్నది నేనొక్కడ్నే. హోటలు అమ్మాయి కారులో ఎక్కబోయేటప్పుడు నా చేతికి ఇచ్చివేసిన ప్యాకెట్ నా ప్రక్కనేవుంది. అందులో నేనారోజుని అక్కడ వదలిపెట్టివెళ్ళిన బూడ్సుల జోడు వుందని డాక్టర్లకే తెలిసిన నా అవకతవక పనులకు వాళ్లేమనుకుంటారో బాగా వూహించవచ్చుగా !...

కారులో కూర్చున్నానని పేరేగాని ఆ సమయాన నాలో రేగిపోతూవున్న ఆలోచనలు నన్ను అన్ని ప్రక్కలకూ అమాంతంగా లాగివేస్తూ వున్నాయి. "పానీయాలని రుచిమాడటం మంచిదే' అది ఒక కళ కూడా! అది కళకున్నట్లె తన హద్దూపద్దుల్లో వుండి వుంటే రక్తికట్టి వుండేది. కాని దానిపట్ల నాకున్న వుత్సాహం, వుద్రేకం మూలాన సూటిదోవన నడవకుండా అదే లొక్కుని పోతూవున్న మార్గాన అమాంతంగా పడాలని వచ్చింది...ఆ! నిజంగా వెర్రివాడ్ని అయిపోయాను. సారాయం తనకు దాసానుదాసులయిపోయినవాళ్ళని ఇలా పీల్చి పిప్పిచేయటం అలవాటేమో కొంపముంచి !...ఊ! ఆ దయ్యమే నన్ను ఇవ్వాళ ఆవేశించింది _ అది చేయాలసిన పనినంతా చేసింది ఆపనివాళ్లముందే!" మొద్దా కోరిక మీద నన్ను పరీక్షించటానికి వాళ్ల పనులను మానుకుని ఆదరాబాదరాగా ఆ హోటలుకేసి వచ్చిన ఆ డాక్టర్ల ముందు....వాళ్ళ వుచ్చుల్లో సులభంగా పడిపోయాను. వాటిని వూడతీసుకుని బయటపడటం కష్టం. ఇంక వాళ్లు ఏం చేస్తారో నాకు బాగా తెలుసు. ఈ సమయాన్నే నా తెలివితేటల్ని చక్కగా వుపయోగించాలి !

అదృష్టవశాత్తు నేను పుచ్చుకున్న పానీయాలు ఘాటువైనా నామీద ఇతర్లు అనుకున్నట్లు అంతపని చేశాయికావు. మరొక్కళ్లకయితేనా ఒక్కబుడ్డి ఖాళీచేయటంతోనే మత్తెక్కిపోయేది. చొంగలు కార్చుకుంటూ అక్కడే పడి కొట్టుకుంటూ వుండేవాళ్లు! అలాంటి విషాదఘట్టం నుంచి ఇంతవరకు తప్పించుకున్నాననే అనవచ్చు... అంతా నేను అనుకున్నట్లే చకచక సాగిపోతూవున్నా ఆ పాడువాసన సంగతి ఎలా తేల్చుకోవాలో తెలియక తికమకపడిపోతూ వున్నాను.... వాసనను కప్పిపుచ్చటానికి పనికివచ్చే బుడ్డి ఒకటి ఇలాంటి పరిస్థితుల్లో పనికివస్తుందని జాగ్రత్తపరుచుకున్నాను....

వాళ్ళకేసి ఒకసారి చూశాను. వాళ్లు ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నాకేసి చూడకుండానే కాలక్షేపం చేస్తూవున్నారు. అదే మంచి సమయమనుకుంటూ లాగుజేబులో దాచి వుంచుకున్న బుడ్డిని చప్పుడులేకుండా తీసి సగంపైగా ఖాళీచేశాను...ఆ సమయంలో 'నేను చేసిన పెద్ద పొరపాటు లోపలనున్న అద్దం సంగతి పూర్తిగా మరచిపోవటం!

డాక్టరు మాన్స్‌ఫీల్డ్ చక్రంమీద నున్న చేతిని నాకేసి చూపుతూ "ఇదిగో సొమ్మర్‌గారు! అంత తాగటం ఏం బాగాలేదు _ అలా తాగటం ఇప్పుడా?..." అన్నాడు దెప్పిపొడుస్తూ

"ఈ కథా కమామీషు అంతా తెలుసుకోవాలని వుబలాటపడుతూవున్న మా పట్ల ఇలా చిన్నచూపు చూస్తూంటే ఇక పని ఎలా జరుగుతుందని అనుకొంటున్నావు?" అని ఆయన ప్రక్కన కూర్చున్నాయన ఒక వాడి బాణాన్ని సూటిగా నా మీద విసిరివేశాడు....

ఈ మాటలతో వాళ్లు నన్ను అలా బుకాయించి ఎక్కడికి తీసుకుని వెడుతూవున్నారో అవగాహన చేసుకోటం ఏమంత కష్టంకాదు కదూ! వాళ్లు నన్ను ఇలా బంధించి తీసుకుని వెళ్ళడం మా వూరి పెద్ద ఆస్పత్రికే! అక్కడే ఆ పెద్ద డాక్టరు మా ఇంటి

డాక్టరు సమక్షంలో నన్ను పరీక్షచేస్తాడు. నా భవిష్యత్తంతా ఇక ఆ పరీక్షమీదనే ఆధారపడి వుంటుంది....

వాళ్ల మాటలకు నాకు పిచ్చికోపం వచ్చింది. ఇదంతా నా భార్యామణి మార్గా చేసిన పని. ఈ స్థితిలో నన్ను వాళ్లు అక్కడికే తీసుకొనివెళ్లారా మార్గా నామీద కోర్టులో తీసుకుని రాబోయే కేసుకు కావలసిన సాక్ష్యం అతిసులభంగా దొరుకుతుంది... నాలో రేగిపోతూవున్న కోపాన్ని అణచుకోటానికి శాయశక్తులా ప్రయత్నించాను. ఆ కొత్త పానీయం కూడా నా కిందుకెంతో తోడ్పడింది కూడా!...

కారు అడవిమార్గాన దూసుకుని వెడుతూ కొంత సేపటికి మా వూరికి చేరువనే పెద్ద దోవలోకి చేరుకున్నది. వాళ్లు వాళ్ల మాటామంతిలో మునిగిపోయారు. అవన్నీ వాళ్ళ వైద్యానికి సంబంధించిన సంగతులు. ఆ గొడవలో నావైపు చూడటమే మానివేశారు...

ఆ సమయంలో వూళ్ళోనుంచి లారీ ఒకటి కారుకు ఎదురుగా వస్తూవుంది. వెనుకనుంచి మరో కారు హారను వేసుకుంటూ వస్తూవుంది. ముందు వస్తూన్న లారీని తప్పుకోటానికి వెనుక వస్తున్న కారుకి సంజ్ఞ చేస్తూ మా కారు దోవప్రక్కన చప్పున ఆగిపోయింది. వాళ్ళదృష్టి ముందుకేనే! వాళ్ళ గాబరాలో లోపల నేను వున్నానన్న సంగతి వాళ్లు పూర్తిగా మరచిపోయారనుకుంటా...

ఆ పరిసరాలలో చీకటి. కటిక చీకటి. చడీ చప్పుడూ లేకుండా తలుపు తెరిచి దిగి వెనుక నిలిచిపోయిన కారుని తప్పుకుని మరో నిమిషంలో అక్కడినుంచి పలాయనమైపోయాను. అంత పిచ్చి సాహసం, అంత శక్తి, ఆ సమయంలో నాకెలా వచ్చిందో, ఆ సంఘటనని ఇప్పుడు నెమరువేస్తూవుంటే ఆశ్చర్యం వేస్తూవున్నది....

నాకు బదులు, నా సీటులో యథాతథంగా వుండిపోయింది ఆ ప్యాకెట్! ఆరోజు నాటి నా అయోమయావస్థలో దాన్లోనున్న వస్తువులని హోటల్లోనే పారేసి వుత్తకాళ్లతో ఇంటికి చేరుకున్నాను. అదంతా పెద్ద గొడవ...వాటిని జాగ్రత్తగా దాచివుంచి నేను ఇవ్వాళ హోటలునుంచి బయలుదేరటంతో హోటలమ్మాయి ఎంతో ఆప్యాయంతో నా చేతికిచ్చింది. నేను ఇప్పుడు చేసినపని వాటిని వీళ్ల స్వాధీనంలో వుంచేయటం!...

ఆ చీకట్లో రోడ్డుని వదిలేసి అడ్డదోవలో ముక్కుకి సూటిగా కొంతదూరం నడిచాను... ముందు కనబడుతూ వున్నది మా వూరికి చేరువనేనున్న ఒక పేట....

## II

ఇదంతా మెరుపుకిమల్లె ఒక్క క్షణంలో జరిగిపోయింది. వాళ్ళ వుచ్చుల్లోనుంచి ఇంత సాహసం చేసి బయటపడేటప్పటికి నా దగ్గర రాగికాసయినా లేదు. ఆఫీసునుంచి తెచ్చుకున్నదంతా పానీయాల బిల్లు చెల్లించటానికి ఇచ్చేశానుగా! ఇంకా హోటలు వాళ్ళకే బాకీపడి వున్నానుకూడా! మా ఇంట్లో నా డ్రాయరులో కాస్తోకూస్తో దాచివుంచాను. ఈ పళాన ఇంటికి వెళ్ళి ఆ సొమ్మని తీసుకునివచ్చి వుంటేనో?...ఈ సమయంలో ఆ పని చేయటమా? ఈసరికి మా డాక్టరు నా యీ సంఘటన విషయం మార్గాకి చెప్పి వుంటాడు. ఇంటికి డబ్బు తీసికొని వెళ్ళటానికి వచ్చినని మార్గా పసిగట్టిందా? ఇంకేంవుంది?...

మా బ్యాంకుకి వెళ్ళి నాకు కావలసిన సొమ్మని తెచ్చుకుందామా అంటే ఈసరికి బ్యాంకు తలుపులు మూసేవుంటారు. ఇంకేం గత్యంతరం?...

అన్నీపోగా ఇప్పుడు నా దగ్గర వుండిపోయిన వస్తువులు నా బంగారు గడియారం, మా వర్తకానికి సంబంధించిన సీళ్లని వేయటానికి ఎప్పుడూ వుపయోగించుకుంటూ వుండే బంగారపు సీలు వుంగరం. ఈ రెంటికంటే అమూల్యమైన వస్తువు మా పెళ్లి వుంగరం. దానిని చేయించటానికి ఎన్నో వందలు వ్యయం చేయవలసి వచ్చింది. నాకుమల్లె మార్గాకు కూడా ఈ వుంగరమంటే ఎంతో ఇష్టం... మా ఇద్దరి మధ్యా ఈ యుద్ధం ప్రారంభమైనప్పటినుంచి ఆ వుంగరం ప్రయోజనం పోయిందనే అనవచ్చు. దాన్నే ఎవళ్ళకైనా అమ్మకానికి చూపానా కొంతకాలం కాళ్ళమీద కాళ్లు వేసుకుని కాలక్షేపం చేయటానికి కల్పవృక్షంగా వుంటుంది. ఇప్పటికే ఈ పేటలోనున్న అంగళ్లు కట్టివేసి వుంటారు. అంచేత దాన్ని ఇవ్వాళ అమ్మటం అసంభవం....

ఇలాటి క్లిష్టపరిస్థితుల్లో ఇప్పుడేం చెయ్యాలి? ఎంత తర్జనభర్జన చేస్తూవున్నా ఒక దారీ దాపూ అనేది సులభంగా కనబడితేగా!...అయితేనేం సాహసం చేస్తూ ఈ చీకట్లోనే ఈ పేటలోకి చేరుకున్నాను. మునిసిపాలిటీవాళ్లు పాటకజనానికోసం దీన్ని కట్టించారు మంచిరోజుల్లో. ఈపేట అప్పుడు ఎంతో కళకళలాడుతూ వుండేది. యుద్ధవాయువులు ఈ పరిసరా

లలో చేయాలసిన పనినంతా నదురూ బెదురూ లేకుండా చేశాయి. తరతరాలనుంచి నివసిస్తూవున్న ఇక్కడి ఇండ్లకి ఒక నమస్కారం బెట్టి జనం ఇతర చోట్లకి వెళ్ళిపోయారు. బాంబుల వాతనుంచి తప్పించుకున్న ఇండ్లు వానలకు తడిసి, ఎండలకి ఎండి పాడయిపోయాయి. ఇలాటివాటిని మరమ్మతు చేసి నివాసయోగ్యంగా వుంచాలసిన బాధ్యత మునిసిపాలిటీ వాళ్ళది. వాళ్ళకి తగినంత ఆర్థికస్తోమత లేకపోవటంమూలాన వాటి సంగతి తలపెట్టినవాళ్లు కాదు. మా వూళ్లో పెట్టుబడిదార్లకి మంచి అవకాశం దొరికింది. పాడుబడిపోయిన ఇండ్లని మునిసిపాలిటీవాళ్ళ దగ్గరనుంచి కొన్నారు. వాళ్ళ పద్ధతుల్లో చేయాలసిన మరమ్మతులనిచేసి వాళ్ళకీ వీళ్ళకీ అద్దెలకిస్తూ బోలెడు సొమ్మని సంపాదిస్తూ వున్నారు. ఈ పేట సంగతి మా వూరికి వచ్చిన తరువాత ఎన్నో సార్లు విన్నానేగాని, ఇంతవరకు ఇటుకేసి వచ్చినవాణ్ణి కాను....

ఇప్పుడు నాకు కావలసింది ఈ రాత్రి తల దాచుకోటానికి ఇల్లు. దోవకి రెండు ప్రక్కలనున్న ఇండ్లకేసి తదేకదృష్టితో చూస్తూ ముందుకి నడుస్తూ వున్నాను. ఒక ఇంటిముందు బోర్డు తగిలించి వుండటం చూశానో లేదో, చప్పున అక్కడ ఆగాను. దాని మీద వ్రాయబడ్డది ఆతృతతో చదివాను. ఆ ఇంట్లో అద్దెకు వుంటూ వున్నాయన ఇంట్లో కొన్ని గదులని అద్దెకి ఇస్తాడట. గదుల్లో వుండేవాళ్ళకి కావలసిన సౌకర్యాలు తనే చూసుకుంటాడట. ఘరానా మనుషులకే అద్దెకిస్తానని కూడా స్పష్టంగా అందులో వుదహరించాడు....

ఇంటి తలుపు మూసివుంది. బయట గంట వుంది. దాన్ని గట్టిగా నొక్కి ఎవళ్ళయినా లోపలినుంచి తలుపు తెరుచుకుని వస్తారని వోపికపట్టి ఇంటిముందర వేచివున్నాను. తలుపుకి సమీపాన్నే వంటగది వుండి తీరాలి. వంటపాత్రలని శుభ్రం చేస్తూ వున్న సందడి బయటినుంచి స్పష్టంగా వినవచ్చు.... పది పదునైదు నిమిషాలకి ఆ అలజడి ఆగిపోయింది. తలుపుని బారగా తెరుస్తూ ఇంటాయన నాకేసి విడ్డూరంగా చూడసాగాడు.

ఆయన వయస్సులో నాకన్న అంత పెద్దవాడుగా కనిపించటంలేదు. సన్నపాటి మనిషి. వేసుకున్న దుస్తులు అతని పేదరికాన్ని స్పష్టంగా తెలుపుతూనే వున్నాయి. కొంచెంసేపు అయ్యాక ఏం అనుకున్నాడో లోపల నిలుచున్న మనిషి వినయవిధేయతలు చూపెడుతూ బయటికి వచ్చాడు. "గంటని ఎందుకు నొక్కారు? మావంటి వాళ్ళతో ఇలాటి సమయములో మీకేం పని వుంటుంది?" అని సవినయంగా అడిగాడు.

ఇలాటి సమయాల్లో ఇలాటివాళ్ళతో ఎలా మెలగాలో నాకు బాగా తెలుసు.

ఎంతో ప్రశాంత గంభీరస్వరంతో "ఇంత చీకట్లో ఇలా వచ్చినందుకు క్షమించాలి. ఇలా వెడుతూ మీ ఇంటిముందు కట్టబడ్డ బోర్డుని చూశాను. మీ ఇంట్లో గదులు అద్దెకిస్తారని చదివాను. ఈ పరిసరాలు నాకు బాగా నచ్చాయి. నాకొక గది కావాలి" అని ఆయనకేసి చూస్తూ అన్నాను.

"మీ సొంతానికా? లేక మరెవ్వళ్ళకైనానా?" అనుమానంతో చేతులు తడుముకుంటూ అడిగాడు.

నాకేనని సూటిగా జవాబిచ్చాను.

మరొకసారి నన్ను ఎగాదిగా చూస్తూ "మీవంటి వాళ్ళకి తగిన గదులు మా ఇంట్లో లేవు. ఇది కూలినాలి చేసి జీవించేవాళ్ళు వుండే పేట. అలాటివాళ్ళకి తగిన గది మాత్రం ప్రస్తుతం ఒకటి ఖాళీగావుంది..." అని నీళ్ళు నములుతూంటూ అన్నాడు.

"ఊఁ! అలాటి గది నాకు సరిపోతుంది. దాన్నొకసారి చూపెడితే సంతోషిస్తాను" ధీమాగా తలెత్తి అతనికేసి చూస్తూ అన్నాను.

♦ ♦ ♦

మారుమాట్లాడక ఆ మనిషి ముందు నడిచాడు. నేనాతన్ని అనుసరిస్తూ లోపలికి నడిచాను. మెట్లు ఎక్కి మేడమీదికి చేరుకున్నాం. ఆయన అన్నట్లు అక్కడ వున్నది ఒకటే గది. తలుపు తెరచాడు. లోపల అంత చెప్పుకోదగ్గ సౌకర్యాలు కనబడటం లేదు. ఆ దృశ్యాన్ని చూస్తుంటే చాల పాతదని అతి సులభంగా గ్రహించవచ్చు. పాతమంచం వుంది. మేజాబల్లా కుర్చీలు కూడా తాతలనాటివే. ఆ ఇల్లు ఒక గుట్టప్రదేశంమీద కట్టబడింది. అందుచేత కిటికీ తెరిచిచూస్తే మా వూరు బాగా కనబడుతుంది. ఊరికి ఆవలివైపున వున్న తోటలు, కొండలు, నది, లోయ ప్రదేశాలు చక్కగా చూడవచ్చు. బయటి ఈ దృశ్యాలను తదేకంగా చూస్తూ ఒకసారి ఆయనకేసి చూస్తూ "ఈ కిటికీలోనుంచి ప్రకృతి దృశ్యాలని అస్తమానమూ చూస్తూ కాలక్షేపం చేస్తూ వుండవచ్చు" చిరునవ్వు నవ్వుతూ అన్నాను.

(569వ పేజీ చూడుడు)

# 'శాంతి స్థాపన'



"సాహిత్యానంద్"

సూర్యం సెలవుల్లో అత్తవారింటికి వెళ్ళాడు. గడపలో అడుగు పెట్టగానే అతనికి ఈ దృశ్యం కనిపించింది. బావ మరదులు, మరదలు యుద్ధం చేస్తున్నారు "చిన్ని" చేతిలో బెలూన్ను శంకరం లాక్కున్నాడు. "చిన్ని" శంకరాన్ని రెండు దెబ్బలు వేశాడు. ఈ గల్లంతులో శంకరం దగ్గర బెలూను దుర్గ లాక్కుని పరుగెత్తబోయి కాలు జారి పడింది. శంకరం దుర్గ వీపు మీద ఒక్కటి వేశాడు. దుర్గ ఏడుపు సాగించింది. ఇంతలో యింట్లో నుంచి పెద్ద బావమరిది రామం వచ్చి శంకరాన్ని కోప్పడుతూ రెండు అంటించాడు. శంకరం తిరగబడ్డాడు.

ఈ చిన్న కురుక్షేత్రాన్ని చూస్తూ సూర్యం గుమ్మంలో నిలబడిపోయాడు. పిల్లల్ని కోప్పడుతూ యింట్లోనుంచి వచ్చిన బామ్మగారు సూర్యాన్ని చూసి "రా నాయనా! ఎంతసేపైంది వచ్చి! రామం! బావకాళ్లకు నీళ్ళు తీసుకురా" అంది. అప్పటికి వాళ్లు సూర్యాన్ని చూసి "బావ బావ" అంటూ చుట్టూ చేరారు. "ఏమిటోయ్ యిలా కొట్లాడుకోవచ్చా" అంటూ బావమరదులకేసి చూశాడు సూర్యం. "సెలవులిచ్చారు, యిదేవరస-చస్తున్నాం వీళ్లతో" అంది బామ్మగారు. సరోజ గుమ్మంలో ప్రత్యక్షమైంది. సూర్యం చూపులు అటుమళ్ళినవి.

♦ ♦ ♦

ఆ మధ్యాహ్నం గదిలో కునుకుతీస్తున్న సూర్యానికి నిద్రాభంగం అయింది. వెనుక పంచలో అత్తగారూ, బామ్మగారూ, మాటామాటా అనుకుంటున్నారు. "ఇదంతా నా ప్రారబ్ధం" అని వల్లిస్తున్నారు బామ్మగారు. "ఇప్పుడు నేనేమన్నాననీ! నలుగురూ, నేను మిమ్మల్ని కష్టపెడుతున్నానని అనుకోవాలనేగా మీ ఉద్దేశ్యం." అంటున్నారు అత్తగారు. అంతలో మామగారు మాటలు వినపడినై. "మళ్ళీ సాగించారూ! అవతల అల్లుడుగారు ఉన్నాడన్నైనా జ్ఞానం లేదూ ఛీ ఛీ" విసుగుతో అంటున్నారాయన. బామ్మగారు ఏదో అంటోంది. ఇట్లా వారి తగువు వింటూ వుండటం సూర్యానికి నచ్చలేదు. "సరోజా" అని కేక వేశాడు భార్యను. పంచలో మాటలు ఆగిపోయినవి.

♦ ♦ ♦

నాలుగు రోజులు గడిచినవి. సూర్యం పేర ఒక పుస్తకాల పార్శిలు వచ్చింది. ఇంటిల్లపాదీ ఆ పార్శిల్ ఏమిటా అని ఆసక్తి చూపసాగారు. ఆ రోజు భోజనాలైన తరువాత సూర్యం హాల్లో అందర్నీ సమావేశపరిచాడు. అందరూ ఉత్కంఠతో కూర్చున్నారు. పిల్లలు సూర్యం చుట్టూ

చేరారు. "బామ్మగారూ! మీకేం పుస్తకాలంటే యిష్టమో చెప్పండి" ప్రశ్నించాడు సూర్యం. కాసేపు ముసిముసి నవ్వులు నవ్వి ఆవిడ అంది "పురాణాలకు సంబంధించిన పుస్తకాలు యిష్టంబాబూ" సూర్యం వరసగా అందర్నీ వారికి ఏరకం పుస్తకాలంటే అభిరుచో పృచ్ఛ చేశాడు. మామగారికి "మతమూ, తత్వశాస్త్రమూ, పద్యసాహిత్యం, -" అత్తగారికి "గృహ విషయాలు, హాస్య గ్రంథాలు, -" రాముకు "జీవిత చరిత్రలు, నవలలు, విజ్ఞాన విషయాలు, -" శంకరానికి "సాహసిక విషయాల పుస్తకాలు" చిన్నికి "బొమ్మలు, గమ్మత్తులు" దుర్గకు "బొమ్మలాటలూ చిన్నపాటలూ" - ఇక సరోజకు, "క్రొత్తరకాల పిండివంటలతో పాటు అన్ని రకాల పుస్తకాలు" చదవాలని వుందట. ఇలా అందరి అభిరుచులు తెలుకొని సూర్యం, ఆపార్శిల్లోని పుస్తకాలు తీసి, ఎవరికి ఏ పుస్తకాలు కావాలో - యిచ్చివేశాడు అందరికీ.

ఆ మధ్యాహ్నం ఆ యింట్లో పిల్లలు వున్నట్లు అనిపించలేదు. అందరూ తలో మూలా కూర్చుని బావగారు తెప్పించిన పుస్తకాలు శ్రద్ధగా చదివేస్తున్నారు. గదిలో పడుకుని చదువుకొంటున్న సూర్యానికి పంచలోనుండి ఏవోనవ్వులు వినిపించినై, అత్తగారూ బామ్మగారూ నవ్వుకుంటున్నారు. బామ్మగారు తను చదివే పుస్తకంలో ఏదో విశేషం చెప్పి కోడల్ని ఆశ్చర్యంలో ముంచివేస్తోంది. తిరిగికోడలు తను చదువే హాస్యఘట్టాన్ని బామ్మగారికి చెప్పి ఆవిడను నవ్వించి తనూనవ్వుతోంది. మామగారు హాల్లో వాలు కుర్చీలో పడుకుని పుస్తక పఠనంలో మునిగిపోయారు. ఆ సాయంత్రం అందరూ, తమకటువంటి మంచి పుస్తకాలు యిచ్చినందుకు సూర్యాన్ని అభినందించారు.

మామగారు ఆ యింట్లో 'శాంతిస్థాపన' చేసినందుకు ప్రత్యేకాభినందనలు తెలిపి, "ఆ పుస్తకాలు ఎక్కడ తెప్పించావోయ్" అని అడిగారు సూర్యాన్ని. "ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు వారికి వ్రాసి తెప్పించానండీ" అన్నాడు సూర్యం. "పిల్లలకు పెద్దలకు ఎవరి అభిరుచులను బట్టి వారికి రకరకాల మంచి పుస్తకాలు లభింపచేస్తున్నందుకు ఆ సంస్థవారికి అభినందలు అభివందనలు తెల్పాల్సివుంటుంది. ఏమంటావ్" అన్నారు ఆయన. "ఈ ఒక్కదానికే కాదు యింకో ముఖ్యవిషయానికి గూడా వారికి అభినందన పరంపర తెలిపాల్సివుంటుంది" అన్నాడు సూర్యం.

"ఏమిటది?" ఔత్సుక్యంగా ప్రశ్నించారాయన. సూర్యం యిలా చెప్పసాగాడు "వారు ఇంటింటా గ్రంథాలయం" అనే ఒక ప్రణాళిక ప్రారంభించారు. ఇది మన పుస్తక పంపిణీరంగంలో విప్లవాత్మకమైనది. మనబోటి సాహిత్యప్రియులకు ఎంతో ఉపకారి. అసలు విషయం ఏమిటంటే నెలకు 5 రూ. ల చొప్పున 18 నెలలుగాని, ఒక్క సారిగ్గా 90 రూ.లు గాని వారికి చెల్లిస్తే, అందుకు ప్రతిఫలంగా వారి పట్టిక లోనుంచి మనం కోరుకున్న 100 రూ. ల పుస్తకాలు, వారు ఉచితంగా పంపించే

15 రూ. ల విలువగల పుస్తకాలు, రు 7. 50 లు విలువక్రింద "పుస్తక ప్రపంచం" అనే మంచి మాసపత్రిక, ఇంకా మనకు పుస్తకాల రవాణా ఖర్చులు రు 4-50. ఆదా అవుతవి. ఇందు మూలంగా 'మొత్తం మనకు 37 రూ. లు ఆదా అవుతుంది. మంచి గ్రంధాలూ లభిస్తాయి. మనకు యిది లాభసాటి కాదంటారా"

"అలా ఎందుకంటాను. ఎంతో వీలుగా వుంది ఈ పధకం. చందాపద్ధతీ తేలిగ్గా వుంది. 37 రూ.లు ఆదా అవుతున్నాయ్. ముఖ్యంగా మనం కోరుకొన్న రకరకాల మంచి పుస్తకాలూ లభ్యమౌతున్నై, వెంటనే చందా కడతాను. రేపే. ఏమంటావ్"

"శుభస్యశీఘ్రం - అవశ్యం మనియార్డరు రేపే పంపించెయ్యండి, నేను వారం రోజులకిత్రమే చందా పంపాను" అన్నాడు సూర్యం చిరునవ్వుతో.

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



శ్రు॥ నాభి ర్నిరభిద్యత, నాభ్యా అపానో
ఽపానా న్మృత్యుః.

[నాభి కలిగెను. నాభినుండి అపానము కలిగెను. అపానమునుండి మృత్యువు కలిగెను.]

సజీవశరీరమునందలి ముఖ్యమగు ప్రాణవ్యవహారము వర్ణింపబడుచున్నది. గోళయము, వ్యవహారము, అధిష్ఠానదేవత, క్రమముగ తెలుపబడుచున్నవి. హిందూమత శ్రుతులందు ప్రాణమనగా వాయువని అర్థము లేదు. ప్రాణమనగా, దేహమునందలి చైతన్య వ్యవహారములు. ఒక దేహమునందు జీవుడు వ్యవహరించు కాలమున జీవిత వ్యవహారమును గమనింపబడి, అయిదు ప్రత్యేక వ్యవహారములుగ వర్గీకరింపబడియున్నది. ఆ ఐదు వ్యవహార శాఖలను పంచప్రాణములనబడును. దేహమునందు జాగ్రదావస్థయందు జ్ఞానేంద్రియముల ద్వారా బాహ్యప్రపంచ విషయములతో స్పర్శ గలిగించుకొనుశక్తి ముఖ్యప్రాణమనబడును దేహములోని మురికిని బైటత్రోయుట, బీజమును స్రవింపజేయుట అపానమనబడును. సజీవదేహమున ఆహారమును జీర్ణము చేయగలశక్తి వ్యానమనబడును. జీర్ణము పొందిన ఆహారరసమును, దేహమాద్యంతము సమముగ పంచిపెట్టు శక్తి సమానమనబడును. దేహమును వదలునపుడు, మరణసమయమున, జీవుని మనోబుద్ధులు స్థూలశరీరమును వదలుట యను కడపటి వ్యవహారశక్తిని ఉదానమనబడును.

ఈ ఐదు పేర్లును దేహమునందలి జీవుని వ్యవహారములకు గల పంచముఖములుగ నున్నవి. వీటిలో అపానమునకు కేంద్రనాభిస్థానము — రూపగ్రహణశక్తి, దృష్టి, నేత్రములందున్నది. అటులనే స్ఖలనము, విసర్జనము అను మరణ వ్యవహారములు ప్రాణకోటికెల్ల (మహాయోగులకు తప్ప) — మరణకాలమున కలుగును. "అపానమునుండి మృత్యువు కలిగెను" అనుట యదార్థములు.

శ్రు॥ శిశ్నం నిరభిద్యత శిశ్నా ద్రేతో
రేతస ఆపః॥ (4)

[శిశ్నము కలిగెను. శిశ్నమువలన బీజము (రేతసు) కలిగెను. రేతసునుండి జలము కలిగెను.]

విరాట్పురుషుని దేహనిర్మాణమున లింగవ్యవహారము వర్ణింపబడుచున్నది. వ్యవహార గోళయము, వ్యవహారశక్తి, వ్యవహారమునకు మధ్యవర్తినుల వర్ణనమిందు కలదు.

క్రీస్తుమతమువలె లింగవ్యవహారజ్ఞానము హిందూమతమున నిషేధింపబడలేదు. మానవునికిగల సంతానవాంఛ ప్రథమ పాపమని ఋషులు అంగీకరించుట లేదు. అట్టి పాపమువలన ఈ ప్రపంచము సృష్టింపబడెనని వారు తెలుపుటలేదు. జీవితానందామృత అనుభవమువలన, పరమాత్మ ఈ చరాచర, బహురూప, ప్రపంచమునకు ఆధారశక్తిగ ప్రకాశించుచున్నాడని హిందూమతము నమ్ముచున్నది. కనుక ఈ లింగ వ్యవహార విషయములను తెలుపుటకు ఋషులు జంకుట లేదు. అశ్రద్ధ చేయుటలేదు. మానవజీవిత వ్యవహార విచారమున ఇదొక ముఖ్యాంశముగ నున్నది.

శ్రవణము చేయుటకు చెవులు బాహ్యగోళయములు. వ్యవహారకేంద్రము శ్రవణేంద్రియమని మెదడున కలదు. మధ్యవర్తిగ ఆకాశ ముపయోగపడుచున్నది. అదేవిధముగ, శిశ్నము రేతసు, జలముల వర్ణింపబడుచున్నవి. శిశ్నము బాహ్యశారీరక గోళయము. రేతసు (బీజద్రవము) ఇంద్రియశక్తి. రేతసునందు బీజముండును. బీజవృద్ధికి జలాశయ మత్యంతావశ్యకము. జలములేక వీర్యపతనము కాదు. బీజాభివృద్ధి కలుగదు. కనుక జల మధిష్ఠానదేవత యనబడుచున్నది.

పై వాక్యములన్నియు (మంత్రములు), ఉన్నత శ్రేణియందుండు విద్యార్థి, గురూపదేశ కాలమున వ్రాసుకొనగలిగిన చిత్తుప్రతులవలె తెలియుచున్నవి.

బ్రహ్మాండమంతయు నాయందు కనబడుచున్నది. శిశువుగ జన్మించుటకు పూర్వము, నేను ఆ పరబ్రహ్మముగ నుంటిని. ఒక సంకల్పము కలిగెను. ఆ సంకల్పమును వ్యక్తపరచుటకు నేనొక శరీరమును ప్రవేశించియున్నాను. ఆ శరీరమునకు సర్వేంద్రియములు అమరియున్నవి. కనుక నేను అనగా పరబ్రహ్మము + ఒక సంకల్పము అని తెలియుచున్నది. పరబ్రహ్మమునకు మనసు, బుద్ధిని జతపరచినచో మానవుడగుచున్నాడు. మానవుడు మనసు బుద్ధిని వదలినచో పరబ్రహ్మమగుచున్నాడు.

### 3 భాగము

ప్రథమోధ్యాయము. ద్వితీయ ఖండము.

శ్రు॥ తా ఏతా దేవతా సృష్టా అస్మిన్
మహత్యర్ణవే ప్రాపతం స్త మశ
నాయా పిపాసా భ్యామ న్వ వార్జత్
తా ఏనమ బ్రువన్నా యతనం నః
ప్రజానీ హి యస్మిన్ ప్రతిష్ఠితా
అన్నమ దామేతి.॥ (1)

[ఈ రీతి సృష్టింపబడిన దేవతలు పరిణామకము, పరిమితి యనబడు అల్లకల్లోలములతో కూడిన మహార్ణవమున చాగిలిపడినవి. అపుడు వాటికి ఆకలి దప్పి, (పరమాత్మ) కలిగించెను. అపుడవి అతనితో ఇట్లు పలుకుచున్నవి. "మేము ప్రతిష్టపొంది అన్నము భుజించగలుగుటకు (అనుభవములు పొందుటకు) తగునైన నిలయమును ప్రసాదించుము.]

ఇదివరకు, ఋషి తన శిష్యులకు తెలుపుచుండు ఉపనిషత్ విచారమున (సమష్టి వాసనలకు బద్ధుడగు పరబ్రహ్మము) – ఈశ్వరుడు – విరాట్పురుషుని స్థూలశరీరము నిర్మించు వర్ణన తెలిపెను. అందు బాహ్యస్పర్శల పొందు కేంద్రములు, వ్యవహారములు, అంతర కార్యక్రమములు తెలుపబడినవి. ఈ వరుస క్రమము, గర్భమునందు బీజము నిలచి, వృద్ధిపొంది, పిండమై, శిశువై మానవరూపమున జన్మము పొందు సృష్టి క్రమమునకు సరిపోలుచున్నది.

హిందువులకు కవిత్వమే స్వభావసిద్ధ నైజగుణముగ నున్నది. అసదృశ ప్రకృతి సౌందర్యములతో, సస్యశ్యామల సమృద్ధి సౌభాగ్యములతో కూడిన మన దేశమందు, ఓర్పు, త్యాగము, సర్వసహనము, సుగుణోపేత కళానైపుణ్యములవలన ఏర్పడిన శాంతి సామ్రాజ్యమునందలి హిందూసమాజమున, ప్రతి ఆలోచన, భావము, వాగ్ధోరణి అన్నియు ఆశుకవిత్వముతో నిండి నిబిడీకృతమైనట్లు తెలియుచున్నది. అందువలన, ఆ కాలపు వ్యామోహము ననుసరించి, మతబోధకులు కూడ తమ ప్రవచనములను, కవిత్వధోరణియందు వెలిబుచ్చుచుండిరి. కడకు వైద్యశాస్త్రములు కూడ పద్యకావ్యములుగ నేర్పడియున్నవి.

మహాఋషి, తన కవితాభాషలో శరీర నిర్మాణమున పాల్గొను మహాభూతముల నిందు వర్ణించుచున్నాడు. అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు, చంద్రుడు, మృత్యువు, జలము మొదలగునవి మానవదేహమున వ్యవహారములకు అధిష్టాన దేవతలని తెలుపబడినది. అట్టి అధిష్టాన దేవతలు సృష్టింపబడినవి. ఈ ప్రపంచమున నిలుకడలేని పరివర్తనములు కలుగుచున్నవి. నిరంతరమార్పులు కనబడుచున్నవి. అంతరమున తుపానులు రేగుచున్నవి. బాహ్యమున ఉపద్రవములు కనబడుచున్నవి. ఇట్టి ప్రపంచమునందు ఈ అధిష్టానదేవతలు ప్రవేశించెను.

ఇచ్చట దేవత యనగా, భగవంతుడని యర్థము కాదు. అది హిందూమత అభిప్రాయమునకు విరుద్ధము. శంకరులు విసుగులేక, ఈ దేవత యనుపదము వచ్చినపుడెల్ల, ఆ పదముయొక్క ఉత్పత్తిని విశదీకరించియున్నాడు. దివ్ అను ధాతువునుండి దేవత అను పదము కలిగెను. దివ్–ద్యోతనాత్–అనగా ప్రకాశించునది. జ్ఞానేంద్రియముల మూలమున, ప్రపంచమునందలి ఇంద్రియ విషయములను, ప్రకాశింపచేయు శక్తిని దేవత యనబడును.

జ్ఞానేంద్రియములలోగల చైతన్యము, చూచుట, వినుట, ఆఘ్రాణించుట, స్పర్శించుట, రుచిచూచుట, మాట్లాడుట, మరణించుట, వంశోత్పత్తి కలిగించుట, ఈ శక్తులెల్ల, ఇంద్రియ విషయరాసులగు రూపములు, శబ్దములు, రుచులు, స్పర్శలు మొదలగువాటితో నిండియుండు ప్రపంచమున వదలబడినవి. ఇట్టి నానావిధ రూపగుణములతో నిండిన విషయ ప్రపంచమున, వాటిని వదలుటేగాక, వాటికి ఆకలిదప్పి యను వేదనలు కూడుకొనెను. కనుక, ప్రతియొక్క ఇంద్రియమునకు ఆకలి దప్పి కలుగజొచ్చెను. ఈ బాధలను అవి యోర్వలేకపోయెను. అనుభవించి తృప్తి పొందదల్లాడుచుండెను. ఇట్టి రెండు విధముల ఆవేశములు,

ఉపద్రవముల సహింపజాలక, అవన్నియు కలసి ఈశ్వరుని శరణుజొచ్చెను. ప్రతియొక్కటియు తాను స్థావరమేర్పరచుకొని, తన ఉపకరణముగు ఇంద్రియము ద్వారా ఆహారము తినవలెనని కోరెను.

దృశ్యేంద్రియము (దృష్టి) చెవులను నాలుకలను కోరక, నేత్రములను కోరెను. ఆ నేత్రముల ద్వారా అవి రూపములను, వర్ణములను, అనుభవించి, తన కేర్పడిన క్షుత్పిపాసల తీర్చుకొననెంచెను. అదే విధముగ అన్నియు, తమ కనుగుణముగు ప్రత్యేక క్షేత్రములను కోరి, తమతమ విషయరాసులను అనుభవించి సంతృప్తిపొంద కోరెను.

శ్రు|| తాభ్యో గామా నయత్తా అబ్రువ
న్నవై నో௨యమల మితి.
తాభ్యో௨శ్వమాన యత్తా అబ్రువ
న్నవై నో௨యమ లమితి.|| (2)

[అతడు వారికొరకు ఒక గోవును తెచ్చెను. "అబ్బే! ఇది మాకు నచ్చదు" అని వారు అనిరి. అతడొక అశ్వమును తెచ్చెను. "అబ్బే! ఇది మాకు నచ్చదు" అనిరి.]

ఈశ్వరుని వలన సృష్టింపబడిన ఈ దేవతలు తమ క్షుత్పిపాసలు తీర్చుకొనుటకై, ప్రత్యేక ప్రత్యేక స్థానములు, ఉద్యోగములు కోరినవి. ఈశ్వరుడు వాటి కనేక రూపములను చూపెను. వాటియందవి నిలయముపొంది, తృప్తి బడయగల అవకాశముండెను. ఈశ్వరుడొక గోవును చూపెను. తమ జ్ఞానప్రకాశమునకు, చక్కని అనుభవములకు గోరూపము యోగ్యము కాదని వారు మనవిచేసిరి. "ఇది మాకు నచ్చదు" అని దానిని నిరాకరించిరి. కనుక ప్రభువొక అశ్వమును వారికి చూపెను. సాధు జంతువగు గోవుకన్న అశ్వము చాల శక్తివంతమయినది, రౌద్రము కలది. అయినను, దేవతలు "అబ్బే! ఇది మాకు నచ్చదు" అనిరి.

జీవవికాసమున, ప్రపంచమున గల సర్వజంతు జీవరాసులు అధమ క్షేత్రములుగ నున్నవి. మానవుని యున్నతాశయములు వాటియందు తృప్తి పొందజాలవు. జ్ఞానేంద్రియములు, మానవునియందు పొందగల సుఖానుభవములను, మృగరాశియందు పొందజాలవు. తినుట, నిద్రించుట, సంతానము కనుట, శయనించుట, రక్షించుకొనుటయందు మృగములు ప్రకృతిసిద్ధ జ్ఞానముల చేత ప్రవర్తించుచున్నవి. మానవుని వ్యవహారములు వీటికి వ్యతిరిక్తముగ నున్నవి. సూక్ష్మము, రసాస్వాదకరము, ఆనందకరము అగు అనుభవములను మానవుడు పొందుచున్నాడు. కనుక ఆ దేవతలు (వ్యవహారశక్తులు) నీచజీవరాసుల శరీరములు తమకు సంతృప్తి నీయజాలవని వాటినెల్ల నిరసించెను. జీవవికాసములకెల్ల మకుటమువంటి మానవ శరీరము నవి కోరెను.

డార్విన్ మహాశయుడు, వికాసమున చతుష్పాద జీవులకన్న, ద్విపాదజీవులు గొప్పవని, ఈ భావమునే ప్రకటించియున్నాడు. ఇచ్చట గోవు, అశ్వము రెండు జాతుల నుదహరించియుండుట, సర్వజంతువులు నుదహరించినట్లు గ్రహించవలెను. జంతువుల జీవితమున జ్ఞానేంద్రియములు సంపూర్ణతృప్తి పొందజాలవు. పరిపూర్ణానంద మనుభవించగల క్షేత్రము మానవజన్మ మొక్కటియే. ఈ భావము ముందు విశదమగును.

శ్రు|| తాభ్యః పురుష మానయత్తా.
అబ్రువన్ సుకృతం బతేతి. పురుషో
వావ సుకృతమ్ వా అబ్రవీ ద్యథా
యతనం ప్రవిశ తేతి.|| (3)

[అతడు మానవాకారమును వారివద్దకు తెచ్చెను. "ఆహా! చాల సొగసైన నిర్మాణము.—వాస్తవముగ మానవుడే సౌందర్యగని. మానవనిర్మాణము చాల బాగున్నది. సంశయము లేదు" అనిరి. "మీ మీ ప్రత్యేక స్థానములను ప్రవేశింపుడు" అని అతడు వారికి చెప్పెను.

సృష్టికర్త, ప్రభువు, కడపట చక్కని మానవ శరీరమును సృష్టించెను. అందు జ్ఞానేంద్రియములకు స్థానముండుటేగాక, ఉన్నత కౌశల్యములు, కవితాశక్తులు, తీక్ష్ణమగు విచక్షణాశక్తులు, ప్రకాశించుటకు కూడ ఆస్పదముండెను. మానవుని విశాలబుద్ధియొక్క సహాయమున ఆ దేవతలు, పూర్ణానందము ననుభవించగలుగుచున్నవి. తత్ఫలితముగ మానవుడు పుష్టికర ఆహారము కోరుచున్నాడు. శుభ్రమగు చక్కని వస్త్రముల కోరుచున్నాడు. సౌందర్య మపేక్షించుచున్నాడు. గౌరవము నాశించుచున్నాడు. వెచ్చని వాతావరణము, మంచి ప్రకాశము, యోగ్యమగు సహవాసము కోరుచున్నాడు. ప్రేమ చూపుచున్నాడు. అన్ని సౌకర్యములు తాను కూర్చున్నచోట సమకూడవలెనని కోరుచున్నాడు.

(సశేషము)

# "పరిహాసానికి పరిహారం"



శ్రీ సాయినాథశాస్త్రి

శేఖరం అప్పుడే కాలేజీనుంచీ యింటి కొచ్చాడు. బట్టలు మార్చుకుని యీజీ చైరులో నడుంవాల్చి సిగరెట్ వెలిగించి కళ్లు మూశాడు. కళ్లల్లో సరోజ మెదిలింది. సరోజ తనకు మేనమామ కూతురు బి. ఏ. చదువుతున్నది. ఒక్క చదువేనా – సరోజ వీణవాయిస్తుంటే! అబ్బ! ఎంత హాయిగానుండేది కంఠస్వరం! త్యాగరాజ కృతిని అంత చక్కగా సరోజ వాయిస్తూ పాడుతుంటే శ్రీరామచంద్రమూర్తి దర్శనం కాకపోదు వినేవాళ్లకి. ఇక-అందం సంగతా! తన కన్నా ఎన్నోరెట్లు మేలు. అటువంటి సరోజ తనజీవితభాగస్వామి కావాలంటే యింకా ఆరునెలలుండాలి. క్రిందటి సారి తను వెళ్ళినప్పుడు సరోజలేదు. వాళ్ల తాతగారింటికి వెళ్లిందట! ఈ సారి శలవలకి వెళ్ళినప్పుడు తప్పకుండా ఉంటుంది. సరోజ తన భార్యయైవస్తే తనకీ హోటలు మెతుకులు తినే ఖర్మ తప్పుతుంది. ఒంటరిగా ఎన్నాళ్లు బాధపడటం? మామయ్యా, అత్తయ్యా వొప్పుకున్నారు. సరోజ ఏమంటుందో తెలియదు. ఆఁ! ఏమంటుంది! సరోజకు తన్ను తెలియదా? అని శేఖరం ఏమిటేమిటో ఆలోచిస్తున్నాడు.

ఇంతలో 'సార్!' అన్నాడు పోష్టు జవాను. శేఖరం కళ్లుతెరిచాడు. పోష్టు జవాను కవరుపడేసి వెళ్ళిపోయాడు. శేఖరం దాన్నందుకుని చించి చదువుకున్నాడు. అంతే! కుర్చీకంటుకుపోయాడు!

అది సరోజ వ్రాసిన ఉత్తరం. శేఖరాన్ని పెళ్ళి చేసుకోటానికి తన కిష్టంలేదని. తను మరొకర్ని చేసుకుందా మనుకుంటున్నాననీ, అందుకు తనను క్షమించవలసిందిగానూ వ్రాసింది. శేఖరం అప్పటివరకూ కంటున్న పగటికలలన్నీ కరిగిపోయినై. ఏం చెయ్యాలో తోచటంలేదు. ఇప్పటివరకూ తానూహించుకున్నవన్నీ కల్పనలేనా! నిజంగా సరోజకు యిష్టంలేదా! మరి వాళ్ళింటికెళ్తే తను తప్ప వేరే ప్రపంచమేం లేనట్టే మెలగేదే తనతో. శేఖరం షాక్ తిన్నట్టు కూర్చున్నాడు నిశ్చలంగా. మనస్సు మాత్రం మహాచికాకుగా వుంది. ఏం పాలుపోవటంలేదు.

శేఖరం అట్టా కూర్చుని కూర్చుని మర్నాడుదయం పనిమనిషి వచ్చి తలుపు తట్టేదాకా యీ లోకంలోనే లేడు. కళ్లు జ్యోతుల్లాగా మండిపోతున్నై. పనిమనిషి గది వూడ్చి, మంచినీళ్లు పెట్టి వెళ్ళిపోయింది. శేఖరం ఏదో నిశ్చయానికొచ్చిన వాడికిమల్లే లేచి, తలుపుకి తాళం వేసి వెంటనే వాల్తేరుకి టిక్కట్టు తీసుకుని రైలెక్కాడు. బండిలో కూర్చున్నాడన్న మాటేగానీ మనస్సు మాత్రం శూన్యంగా వుంది. బండి సాయంత్రానికల్లా వాల్తేరు చేరుకుంది. రిక్షా చేసుకుని బయల్దేరాడు

సరోజను చూద్దామనే కుతూహలంతోనూ, ఆదుర్దాతోనూ, మిట్ట ఎక్కుతోంది రిక్షా. పైనుంచీ ఒక లారీ వేగంగా వస్తోంది. రిక్షా ప్రక్కకు తీశాడు రిక్షావాలా. లారీ చటుక్కున మలుపుతిరిగింది. రిక్షావాలా యింకా కొంచెం పక్కకు పోనిచ్చాడు. రిక్షా చక్రం పల్లంలోకి వొరిగి, రిక్షా బోల్తాకొట్టింది. రాయి కొట్టుకుని శేఖరం తల పగిలింది. 'అమ్మా!' అంటూ మూలిగి కళ్లు మూసుకున్నాడు బాధగా శేఖరం. తర్వాతేం జరిగిందో అతడికి తెలియదు.

♦ ♦ ♦

శేఖరానికి కొంచెం కొంచెం స్పృహ వస్తోంది. మెల్లగా కళ్లు తెరిచి చూశాడు. సరిగ్గా కనిపించటంలేదు. మళ్లా కళ్లు మూసుకుని కళ్లు తెరిచాడు. తల తిప్పబోయాడు. కదల్చలేకపోయాడు. కళ్లు ప్రక్కకు త్రిప్పిచూశాడు. ఎదురుగా అమ్మ కనిపించింది.

"అమ్మా!" అన్నాడు శేఖరం నీరసంగా.

"ఏం కావాలి శేఖరం!" అంటూ శేఖరం తల్లి పార్వతమ్మ కళ్లు పమిట చెంగుతో వొత్తుకుంటూ వచ్చింది.

"ఏడుస్తున్నావా అమ్మా?"

పార్వతమ్మ లేదని తల వూపింది. కళ్లు వాచివున్నై.

"అమ్మా!" అన్నాడు మళ్ళీ శేఖరం.

"ఊఁ!" అంది పార్వతమ్మగారు.

"మరే!"

"చెప్పు బాబూ! ఏం కావాలి?" అనడిగింది.

"సరోజ రాలేదా?" అనడిగాడు.

"వచ్చింది శేఖరం! ఇదుగో నీ తల దగ్గరేయుంది" అని చూపించింది పార్వతమ్మ.

శేఖరం కళ్లు పైకెత్తి చూశాడు. ఏమీ కనిపించలేదు. తల కదిలించబోయాడు. నరాలు కదిలి బాధ కలిగింది. 'అబ్బా!' అని మూలిగాడు శేఖరం. కాసేపాగి "సరోజా!" అన్నాడు శేఖరం.

సరోజ కళ్లు కప్పుకుని ఏడుస్తూ వచ్చి ఎదురుగా నుంచుంది.

"ఏడుస్తున్నావా సరోజా!" అనడిగాడు శేఖరం.

సరోజ మాట్లాడ్లేదు.

"ఏడవకు సరోజా! ఇదుగో యిటు చూడు - నీ యిష్టానికి నేనెప్పుడూ అడ్డురాను. నీకిష్టం వచ్చినవాడినే పెళ్లి చేసుకో. ఇక నేనుండనుగా" అని ఆయాసంగా అన్నాడు.

"బావా!" అని వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది సరోజ.

సరోజ ఎందుకేడుస్తుందో అర్థంగాక శేఖరం ఆశ్చర్యంగా చూస్తున్నాడు. పార్వతమ్మగారికిదేం అర్థంగాక విస్తుపోయి చూస్తోంది. ఇంతలో ఎవరో పిలిస్తే అక్కణ్ణుంచీ వెళ్ళిపోయింది.

"నన్ను క్షమిస్తావా బావా?" అంది సరోజ ఏడుస్తూనే.

"ఎందుకు సరోజా! నువ్వేం తప్పు

చేశావని? నీ కిష్టంకాండే నిన్ను బలవంతంగా పెళ్ళిచేసుకుంటానా?'' అని అన్నాడు శేఖరం.

''కాదు బావా! నావల్లనే యిదంతా జరిగింది. నన్ను క్షమించావంటే నీకు... చెబుతాను'' అంది సరోజ.

శేఖరం మాట్లాడలేదు.

సరోజ మంచంమీద కూర్చొని శేఖరం కాళ్లను స్పృశిస్తూ, ''నీవేమనుకుంటావో చూద్దామని రాశాను బావా! నీకా కవరు. అంతేగానీ మరేంలేదు'' అంది.

''నిజంగానా సరోజా!'' అనడిగాడు ఆత్రుతతో శేఖరం.

''నిజం బావా! ఆ మాత్రం నమ్మలేవా? నిన్ను ఎప్పట్నుంచో జీవితసర్వస్వంగా ఆరాధిస్తున్నాను. అలా నీతో ఎన్నిసార్లు చెప్పానో గుర్తులేదా బావా? ఇప్పటికీ, ఎప్పటికీ కూడా నీదాన్నే! నన్ను క్షమించు బావా! ఇదంతా నా తెలివితక్కువ మూలంగానే జరిగింది. నమ్ము! బావా! నేను నీదాన్ని'' అంటూ శేఖరం కాళ్లమీద తలపెట్టి ఏడ్వసాగింది.

శేఖరం సంతోషంతో పుక్కిరిబిక్కిరై పోయాడు. గుండె వేగం హెచ్చింది సంతోషంతో. రక్తప్రవాహ వేగం అధికం కావటంతో తలకు కుట్టినకుట్లు తెగిపోయినై. ''అమ్మా!'' అంటూ గట్టిగా మూలిగి కళ్లు మూసుకున్నాడు శేఖరం. సరోజ తలపైకెత్తి చూసింది. తలమీద కట్టినగుడ్డ అంతా రక్తంతో తడిసిపోయింది. సరోజ కంగారుగా ''బావా!'' అంటూ పిలిచింది. శేఖరం ఒక్కసారి ప్రయత్నపూర్వకంగా కళ్లెత్తి చూసి మళ్లా కళ్లు మూసేసుకున్నాడు.

సరోజ కంగారుగా డాక్టరుగారి గదిలోకి పరిగెత్తుకొనిపోయి, పరిస్థితంతా చెప్పింది. డాక్టరు కూడా ఆదుర్దాగా వచ్చాడు. శేఖరంకి స్పృహలేదు. కాని ముఖంలో మాత్రం సంతృప్తి కనబడుతోంది. డాక్టరు పరీక్షచేసి —

''ఇతనికేమైనా హఠాత్తుగా సంతోషం కలిగించే సంగతుల్లాంటివేమైనా చెప్పారా?'' అని ప్రశ్నించాడు సరోజని. సరోజ ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. డాక్టరు నర్సును పిలిచి ఏవో మందులు తెమ్మన్నాడు. నర్సు పరుగెత్తుకొని వెళ్ళిపోయింది.

డాక్టరు సిరెంజి తీసి నర్సు తెచ్చినమందు సిరెంజిలోకి తీశాడు. శేఖరానికి యింజెక్షను చేశాడు. ఉహూ! లాభంలేకపోయింది. శేఖరంలో ఏ చైతన్యమూ రాలేదు. మరో మందు ఎక్కిద్దామని చెయ్యి పట్టుకున్నాడు డాక్టరు. చెయ్యి చాలా చల్లగా మంచుగడ్డలాగావుంది. సిరెంజి నీళ్ల బేసిన్లో వదిలేసి నిట్టూరుస్తూ చేతులుకడుక్కోటానికి వెళ్ళిపోయాడు. సరోజ యిదంతా చూస్తూనేవుంది.

ఏదో పని మీద వెళ్ళిన పార్వతమ్మ అప్పుడే లోపలికొచ్చింది. ఇదంతా చూసి కంగారుగా నర్సుదగ్గిరకెళ్ళి ఏమైందని అడిగింది. నర్సు 'చనిపోయా'డని చెప్పింది. పార్వతమ్మ ఒక్కసారిగా నిశ్చేష్టురాలై పోయింది. మరుక్షణం ''బాబూ!'' అంటూ బావురుమన్నారు శేఖరం శరీరంమీదపడి.

సరోజ కళ్లు మూసుకుంది — కాదు కళ్లు వాటంతటవే మూతలు పడిపోయినై. సరోజ స్పృహతప్పిపడిపోయింది.

సరోజకు తెలివచ్చేటప్పటికి శేఖరం శవాన్ని తీసికెళ్తున్నారు. తన తెలివి తక్కువతనంచేత తనబావను - తనంటే ఎంతో ప్రేమగలవాణ్ణి - తనను పెళ్లి చేసుకుందామనుకున్న వాణ్ణి లేకుండాచేసుకుంది. సరోజ తను చేసిన పరిహాసానికి పరిహారంగా జరిగిన పర్యవసానాన్ని గురించి ఆలోచిస్తూ పిచ్చిగా శూన్యంలోకి చూస్తూ వుండి పోయింది.

# తొందరపాటు

కుమారి ఇందిర

(గత సంచిక తరువాయి)

ఉలిక్కిపడ్డాడు. "నీవా, ఎంత ధైర్యము చేసావు. ఎవ్వరు చూడలేదు కదూ" అంటూ మా యింటికి కనబడు కిటికీ తలుపులను మూసివచ్చాడు.

"గెటిన్, సుమిత్ర" అంటూ చిరునగవుతో ఆహ్వానించాడు.

ఇంతకు మునుపు అతని అందమును దూరమునుండి చూసి మురిసిపోవుచుంటిని. ఇప్పుడు మిగులా దగ్గర నుంచి చూడ అవకాశము లభించినందులకు నా కెంతో ఆనందమయినది. మనస్సంతా అదోమాదిరయినది. క్షణముకూడ అక్కడ నిలబడలేకపోయినాను. వెంటనే గదిలోనికిపోయి, ఆనంద్ ముందున్న, కేన్ చేర్‌ను లాగుకొని మేనువాల్చి నా లేతదేహమునకు కాస్త విశ్రాంతినిస్తూ ఒక ఘాడ నిట్టూర్పు విడిచాను.

ఎడమవైపు రతీ, మన్మధుల క్రీడాభంగిమలో నొక క్యాలండర్, కుడివైపు పార్వతీ, శివుల నృత్యమొనర్చు బెంగాల్ కెమికల్స్ వారి క్యాలండర్లు బాగా అలంకరించబడినవి. అన్నిటికన్న ఆనంద్ ఏదో [illegible] నిమగ్నుడైనట్లు తీయించుకున్న ఫోటో ఆ గదికి మిగుల సోయగాన్ని కూర్చినది. టేబుల్‌పైన చిన్న పిలిప్స్ రేడియో, దగ్గరలో ఒక చిన్న బుద్ధభగవానుని విగ్రహము, నిజంగా ఆ గది చాల అప్ టు డేట్‌గా అలంకరించబడినది.

"సుమిత్రా! గది బాగుందా?" అని ఆనంద్ చెప్పేంతవరకూ అతని ఫోటోనే చూస్తూయుండిపోయాను.

"బాగులేకుంటే, వస్తానా!"

"ఓహో! చాల చురుకైనదానవే" అంటూ నా బుగ్గపై తన మునివ్రేళ్ళను తెచ్చి నాట్యమాడించినాడు.

వళ్లంత జలదరించినది. అతని స్పర్శకు శరీరమంత ఐస్‌లాగా చల్లబడ్డది. లేచివచ్చి తన వేడిబాహువులలోనికి నా వంపులు తిరిగిన పసిడి శరీరాన్ని గట్టిగా బిగించి, నా లేత పెదవులను తనివితీర చుంబించాడు.

"వస్తాను, ఆనంద్" అంటూ వాకిలి తెరచుకొని బైటికి వచ్చాను.

"థ్యాంక్స్" అన్నాడు.

"నో మెంషన్" అయినా చెప్పేందుకు నోరాడలేదు. బావ వచ్చి కాంపౌండు గేటు దగ్గర నిల్చున్నాడు. వళ్లు వణికిపోయినది. ధైర్యముచేసి ముందుకు పోయాను ఏమెరుగనట్లుగా.

"ఏం, సుమిత్రా, ఎక్కడనుంచి రాక" అని ఆప్యాయంగా పలుకరించాడు. చీట్లాటలో బాగా డబ్బు వచ్చింది కాబోలు.

"ప్రొద్దుపోక, అలా షికారు వెళ్ళివస్తున్నాను" అంటూ సమాధానము చెప్పి తిన్నగా గదిలోనికిపోయి పడ్డాను.

రోజులు హాయిగా దొర్లిపోతున్నవి. మా కళ్లు ఒకరితో నొకరు సంభాషణ లాడుకొనుచున్నవి. ఆనంద్‌ను చూడనిది ఒక్క నిమిషమైన గడుపుట కష్టమైనది. ఆఫీసుకు పోయిన 8 గంటల కాలమును 8 యుగాలుగా గడుపుచున్నాను. ఒకరోజు ఆనంద్ మామూలుగా ఆఫీసుకు పోవుచూ ఒక ఉత్తరాన్ని మా యింటిముంగట వేసి పోయినాడు.

◆ ◆ ◆

ప్రియమైన సుమి,

నీ ప్రేమానురాగములకు నేను సర్వదా కృతజ్ఞుడను. నీతో గడిపిన ఆ మధురక్షణాలు ఆజన్మాంతము నా హృదయములోనే పాతుకొని పోవునట్లు చూస్తాను. ముఖ్యంగా నీకు వ్రాయదమేమనగా నేను

ఒక మంచి క్రికెట్ టెస్టు ప్లేయరునని చెప్పటకు మరిచిపోయాను. నిన్నటిరోజున మాకు ఇంగ్లాండు పర్యటనకు ఆర్డర్లు వచ్చినవి. ఈ రోజు సాయంత్రమే, మేమంతా కలిసి విమానములో బయలుదేర వలయును. కనీసము ఒక నెలపాటు అయిన అక్కడ యుండవలసివచ్చును. ఈసారైన మన ఇండియా గెలుపొందినదంటే అదంతా నీ చలవు అనియు, నీ స్నేహ భాగ్యమే నాకు విజయము చేకూర్చినదని నా మిత్రులందరికి... లేదు... లేదు, మొత్తం మన ప్రజానీకమునకు పేపర్లద్వారా తెలుపకుండ మానను. ఇది నా కడసారిచూపు... ఛీ, ఛీ, అనకూడదు. నేను త్వరగా తిరిగివస్తాను. తప్పక నిన్ను కలుసుకుంటాను. మరేమి బెంగపెట్టుకొనవుకదూ! సుమిత్రా నేను పోవుచున్నానేకాని, నా మనస్సును మాత్రము నీకే అప్పగిస్తున్నాను. ఏలోటు లేకుండా కాపాడుకొను భాగ్యము నీదే. ఆఫీసు టైమగుచున్నది. ఇక ఉండనా మరి.

ప్రేమతో
నీ
ఆనంద్

నా కంటినుండి రెండు వేడినీటి బిందువులు రాలి సరిగా ఆనంద్ అన్న పేరుపై పడి చెడిపివేసినవి. నాకు నిజంగా భయమేసింది. ఒక్క నెల, 30 రోజులు అమ్మ బాబో, ఎలా గడిపేది. ఒక్క నిమిషము చూడనిదే యుండని ఈ సుమిత్ర, అన్నిరోజులు ఓర్చుకొని యుంటుంద్ంటే కల్ల. కాని ఏమి చేస్తాము. ఆనంద్ సంతోషంగా ఇంగ్లాండు పర్యటనచేసి విజయాన్ని మనదేశమునకు చేకూర్చి నాకు మంచి బహుమతులు తేకపోతాడా !

♦ ♦ ♦

కాలచక్రము గబగబ దొర్లిపోవుచున్నది. సూర్యభగవానుడు తన దినచర్యను ఒక్క దినముకూడ సెలవు తీసికొనక చేసుకుంటూ పోవుచున్నాడు. అప్పటికి ఆనంద్ పోయి సుమారుగా ఒకవారం అవుతుంది. నా ఆనంద్ పోయినప్పటినుంచి నా మనస్సులో మనసు లేదు. ఏదో అర్థములేని ఆలోచనలు. క్షణక్షణం నాలోని భావాలు క్రొత్తవేషాలు వేసుకుంటున్నవి. ఆనంద్ ఎన్నడు తిరిగి రాగలడు? నా జీవితమునకు నవవసంతోత్సవ మెన్నడు చేయగలడు? నా ఆశలకు అంతులేదు. నా వాంఛలు గగనానికి ఎగిరిపోవుచున్నవి.

సనత్ నగర్ నుండి వచ్చి అప్పటికి రెండు రోజులగుతుంది. అప్పుడే వేసిపోయిన వార్తపేపరును తీసుకొని చూస్తూ కూర్చుండిపోయాను. క్రీడారంగం పైకి అనుకోకుండా దృష్టి ప్రసరించినది.

“ఆనంద్ అపారమైన ప్రతిభవలన ఇండియాకు ఇంగ్లండులో డ్రా చేసుకొను అవకాశము లభించినది. 150 పరుగులు నాట్ అవుట్‌తో నిలిచిన అంబాలమూర్తి ఆనంద్‌కు భారతావని ఎంతయో ఋణపడియున్నది” అంటూ గుండ్రటి అక్షరములతో ముద్రించినవార్త నా మనస్సుకు ఆహ్లాదము కూర్చినది.

హృదయపంజరములోని నా ఆశాచిలుకను నింగికి ఎగరేసి ఎన్నడు దిగివచ్చునా అని చూస్తూయుండిపోయాను. నా అందాలగని, నా జీవనవాణి, నా మహోజ్వలవాహిని, అనురాగాలతో నిండిన నా ఆనంద్ ఎన్నడు తిరిగి రాగలడు. నా ఊహలు విజృంభించి పోవుచున్నవి. నా ఆనందము గట్లు త్రెంచుకొని ప్రవహించుచున్నది. పేపరు ముఖముపై వేసుకొని ఒక కునుకు తీసినాను.

♦ ♦ ♦

ఆనాడు ఆదివారం. ఉద్యోగులకందరికి పర్వదినమంటూ ఆనంద్ నాతో ఎన్నోసార్లు చెప్పుచుండెడివాడు. గడియారం 6 గంటలు కొట్టింది. మెల్లగా లేచి ముస్తాబైనాను. ప్రొద్దుపోకడము కష్టమని తిన్నగా గార్డన్‌వైపు దారితీశాను.

భాస్కరుడు బాగా అలసిపోయినట్లుగా యున్నాడు. విశ్రాంతికొరకు కాబోలు ఆకాశపు వడిలోనికి చొచ్చుకొని పోవుచూ పసిడి రంగును గగనమంతా వెదజల్లినాడు. జంట జంటలుగా పక్షులు తమ గూళ్ళకు పయనమగుచున్నవి. గార్డన్ అంతా క్రిక్కిరిసినట్లున్నది. ఒకవైపునుంచి ఒక కుర్రకారు నావైపు చూస్తూ, “అచ్చంగా వైజయంతిలాగా లేదు” అంటాడొకడు. “కాదు... కాదు... సరోజదేవి లాగుందిరా” అంటాడు మరొకడు. ఇంతకు వారిమధ్య ఒక చిన్న పోట్లాటను లేపి నా పాటికి నేను పోవుచున్నాను.

నా చూపులు దూరానపోయే ఒక వ్యక్తిపై ప్రసరించినవి... అతనే... ఎవరికొరకు నా హృదయ కవాటములు తెరచియుంచినానో... ఏ ఆరాధ్యదేవత కొరకు నా జీవనజ్యోతిని ఆరకుండ దేదీప్యమానముగా వెలిగించుచున్నానో... ఏ అందాలబరిణి

కొరకు నా హృదయమందిరము నిండుగా కుంకుమను వెదజల్లియుంచినానో... ఆ అనురాగమూర్తి... నా ప్రేమదేవత, నా అందాల ఆ...న...ం...ద్.

వెంటనే నా ఆశాలత చిగురించి గగనానికి ప్రాకిపోవుచున్నది. మధ్యలో ఒక గద్ద వచ్చి ఆ లతను మధ్యకు త్రుంచిపోయినది. ఒక భాగము నా హృదయముపైపడి ఝల్లుమని కొరడాదెబ్బలాగా తగిలింది. మరొకటి అలాగే ప్రాకిపోయింది. ఆనంద్ ప్రక్క ఎవరో ఒక స్త్రీమూర్తి నడిచిపోవుచున్నది. నా వళ్ళంత జెర్రులు ప్రాకినట్లైనది. బుర్రంత రైలుబండిలాగ పరుగులు తీస్తుంది. తొందర పనికిరాదు. పోయి విషయము కనుగొందమనిపించింది.

దగ్గరకుపోయి పిలిచినాను. నన్ను చూస్తూనే మెల్లిగా నవ్వాడు. అదే మూర్తి. ఏనాడు నాకు తొలిసారిగా చిరునగవుతో దర్శనమిచ్చినాడో అదే విధంగా యున్నాడు ఏమి మార్పురాలేదు. తన ప్రక్కనున్న వ్యక్తిని పరిచయము చేశాడు. భార్యట... పెళ్ళి అయి ఏడాదగుతుందట... ఇప్పుడు ఆరు మాసాల గర్భవతట. నేను అతని యింటికి పోయినప్పుడు పుట్టింటికి పోయియుండెనట. నా ఆశాసౌధము పేకముక్కలలాగా కూలిపోయినవి. నా కాళ్ళ క్రిందున్న భూమి కదిలిపోతూ నన్ను అగాధానికి తీసుకొని పోవుచున్నట్లున్నది. ఒక్క క్షణముకూడ అక్కడ యుండేందుకు మనస్సురాలేదు. తలనొప్పిగా యున్నదని నాకు చెప్పి యింటికి బయలుదేరినాను. గదిలోనికి పోయి గడియ వేసుకొని దిండులో తలదూర్చి, దిండంతనూ కన్నీటితో తడిపివేశాను... వ్రాయుటకు కలం జరుగకున్నది. నా బాధను అనుభవించినవారికే తెలియును. హృదయమున్న మహాశయులారా! నా వ్యధను కాస్త ఆలోచించి చూడండి.

నా కాంక్షాజ్యోతి ఆరిపోయినది. నడి సముద్రములో పయనిస్తున్న నా జీవననావ తెరచాపను ఎవరో త్రెంచివేశారు. అది వడిదుడుకుల్లో కొట్టుకుంటూ సుడిగుండాల వైపుకు పోవుచున్నది. అక్కడ మొసళ్లు తిమింగిలాలు యున్నవి. అవి కబళించి వేయునో లేక తనకు తాను మునిగిపోవునో! నా కళా విధి. నా ఆనందమూర్తిని ఎవరో నానుండి దన్నుకొనిపోయినారు. అంత అందాల భరిణలో ఎంత కాలకూటవిషము పెట్టుకున్నాడు! తను ఒక వివాహితుడనని, తన భార్య రేపోమాపో మాతృమూర్తి కాబోతుందని మచ్చునకైన నాతో సంప్రతించలేదు. ఛీ... ఛీ... నేనే అతనిని తప్పుగా అర్థము చేసుకొనుచున్నాను. ఒక్కసారైన, నేనైనా దానిని గురించి ప్రస్తావించియుండిన ఇంత గొడవ వచ్చియుండెడిది కాదు. క్షణిక సౌఖ్యమునకు ఆశించి, యావజ్జీవనం నరక మనుభవించవలసి వచ్చినది. పెరిగి పోవుచున్న మా ప్రేమలతను అప్పుడే వ్రేళ్ళతో పెకలించి వేరేస్థలములో నాటియుండిన ఎంత బాగుండెడిది. గులాబి బాగా వికసించిందని త్రుంచుకొనుటకు పోయాను. దాని ప్రక్కనే ఒక ముళ్ళను అది పెంచుతున్నది అని తెలుసుకొనలేకపోయాను. నా జీవితములో మొదటిసారిగా పొరబడ్డాను. తొందరపాటు నాకీగతికి తెచ్చింది. క్షణిక భోగమునకు నాలో రేగిన వాంఛారేఖలను ముడుచుకొనలేకపోయాను.

“నాకెన్ని కష్టాలైనా కలిగించు, కాని నా ఆనంద్‌కు ఏ ఒక్క కొరత చూపకు” అంటూ కడసారిగా భగవానుని మనసార సేవించి, మెల్లిగా నిద్రించుటకు ప్రయత్నించాను.



సాహిత్యసరస్వతి శ్రీ సిరిపి ఆంజనేయులు

(గతసంచిక తరువాయి)

3

పడపడి మేళమ్ము భైక్షంబుఁ గొంచుఁ
జను దెంచి, తనయునిఁ గనుఁగొని, యచట
నడచిన గాథయంతయు బొట్టెవలన
విని విస్మయంబును వెఱపును బొందె.

అనుదినం బిట్లొడ్డి నడవిని గొడుకు
నొంటిమై డించి, తా నొక చక్కి నగర
మందు యాచ్నావృత్తి నలిముతీతనము
నెగడ, నెమ్మది తూల, నెగు లొందలేక
యొండొకనాఁ డరుణోదయ వేళఁ
గొమరునిఁ దన వెంటఁ గొంపోవుచుండి
యిత్తెఱంగున వత్సకెఱిఁగించె నితవు –

"నాయనా! వినుమన్న నా చిన్నికూన!
పెను బొందు దారి తప్పిన కారణమున
మనకుఁ బెన్నిడుమయే ఘనుగుడుపయ్యె?
నీ తండ్రి మరణించె నీ శైశవమున;
నది మొదలుగ లేమి యలమెను మనల;
గొడ్డుగోదయు నిల్లు గుళ్ళుఁ దొలంగె;
మడిమాన్యము లడంగె; మన్ననక్రుంగె;
నీ రింకఁ బొలిసెడి నిమ్నగవోలె
మనబ్రదు కిట్లు క్రన్నన బీఱువోవ
ననయమ్ము మనతోడ నొనగూడి మెలఁగు
దగ్గఱి చుట్టాలు దవ్వులఁ జనిరి;
"ఎల్లవారికి మెతుకిడుచుండు మనకు
నింటింటఁ జేయిచాఁచెడి యాడె మబ్బెఁ;
గడుపు చిచ్చు నడంపఁ గలకాల మిటుల
నితరుల వేఁడఁగా నెటు మన పొప్పుఁ?
దలఁప భిక్షాహారతను లగ్గగలదె?
పరువంబు నరుసంబు పాయ వెదాన?
నర్థనఁగను యమయాతనకంటెఁ
గలవారి ముంగిళ్ళఁ గన తుచ్ఛమైన
బ్రదుకుట బాగని మది యెచ్చరించు;
నొరుల యాడిగమున కొడిగట్టు మనకుఁ
దాలిమికల్మి పెద్దయునుంట లెస్స;
ఏ లెడి దొర యెపు డేని మే లెంచి
పనిచిన పని యీశ్వరుని కార్య మనుచుఁ
దలపోసి, తత్సేవ దైవమ్ముఁ గనుచుఁ
దనియుట లెస్స సుంతయు వేసరిలక;
కష్టమ్ములకు నెద గాసిల్లఁ బోక,
పరులాడు మాటలు పంతానఁ గొనక,
యెవ్వరి యెడ లేశ మీసడపడక,
యడఁకువ రూపొందు నటులుంట యుఱవు
మాటలపోబడి మంచిపెబ్బరలు
గుఱితించు తెల్వి చేకుఱ నీకుఁ గాన,
నొక్కింతయదను వమ్మొనరింప కెపుడు
నర్మిలి నరసెడి యయ్యలయండఁ
గుదిరి, కోవిదులైన గురువులఁ గొలిచి,
కూటికుందును గూల్చి, మేటి విద్యలను
గఱచి, విజ్ఞానమార్గము నెమ్మిఁ దడవి
శాంతి సాధన తనే చనవలె నన్న!"
నా విని తల్లికి నందనుం డనియె –
"మనుజునకే కాని మ్రానికి రావు
బాధలు; కుడువక పాయ వేప్రొద్దు;
వాని మా ఱొడ్డుచు వర్తింపఁ జాల
మని నాకు నూరిపోసిన ధాత్రి వమ్మ!

విడువక లేవడి వేఁటాడునాఁడు
శివు నంత వేల్పు దోసిలియొగ్గ ననుచు
సి వాడు చుండుట నేవిందునమ్మ!
వేలు చండాల నా విహితమె కోరి,
నీ యింపుఁబెంపు మున్నిటను ద్రోసి,
నీ పడు నగచాట్లు నేఁ గందునమ్మ!
హేరాళమున మీలు నిహలోకమందు
గడ్డిపోఁచయు మేలు గలుగక యున్న
వెలయుఁజాల దటంచు, విశ్వగోళమున
మానిసి పుట్టువే మాన్యం బటంచుఁ
దెలిపి, నాలో జోతి, నిలిపినావమ్మ!
బ్రదుకుట తనసిరి పాటించి కాదు;
జనహితార్థమె జీవి మనుగడ వలయు

నను సూక్తి నాహృది నదికినావమ్మ!
పట్టు మంచికిఁ దగు; పట్టిన పట్టు
వలవదు వదలఁగా ఫలసిద్ధి దనుక
నను నుడి తార్కాణమునఁ జూపెదమ్మ!
ఈ పరమార్థమ్ము నెద గదియించి
మనికి సాగింపనే మొనసెదఁ గాని,
యెడ రెట్టి దేని నీ యెడఁదకుఁ దేను;
తన తల్లి వెతపెట్టు తనయుండు మూఁడు
భువనమ్ముల శుభమ్ము పొరయఁ డన్నేలి
యుక్తి నా యిచ్ఛ నచ్చొత్తినావమ్మ
ఈ హితవాక్కు లాకృతిఁదాల్చి మ్రోల
మూర్తుల సగణి నిమ్ముగఁ దోఁచు కరణి
నిల్పిన యోజ చెందెను నిన్నె జనని?
అట్టి నీ పంపు సేయఁగ నోఁచనట్టి
పట్టి పట్టియె? యోటి బట్టియాఁ గాని;
ఎల్లర విసిగించు నెడ్డియమైన
కొడుకును నోడిఁ బెంచికొను మాతయంద్రు;
నా జన్మధామమ్ము, నా నిధానమ్ము,
నా పున్నెముల ప్రోవు, నా మన్నికావు,
నా యిలదేవత నా యమ్మ వీవ
కాన, నన్నెట్టి యంగద వేఁచుఁగాక
నీ యానఁ దలమోచి నెగడొందువాఁడ;
మది నిచ్చలును శాంతిఁబొదలించువాఁడ"
నని యింపుఁగుల్క నందనుఁ దూఁదిపల్క
విని, తన డెందము వెన్నయై కరఁగఁ,
బులకల మొలకలు పొడమ నెమ్మేన,
ముద మెడవాడను బొంగి పెంపారఁ,
గన్నుల హర్షాంబు కణములు జాఱ,
సతి, సుతు వదనాంబుజమున మోముంచి
కొడుకు ముద్దాడుచు నడకసాగించె.

(సశేషము)

కేరళ దర్శనము

# గురువాయూరు క్షేత్రము

శ్రీమతి జయలక్ష్మి



తిరుచూరు పట్టణమునుండి బస్సు శరవేగముతో ఇరవై మైళ్ళ దూరములోనున్న గురువాయూరు చేర్చినది. సాయంసమయము పూజవేళ ఇంకా అవలేదు మేము చేరునప్పటికి. ఊరిలో అటూ ఇటూ తిరిగితిమి. ఊరుమధ్య దేవాలయము ఉన్నది. ప్రక్కనే ఉత్తరమునకు స్వామి పుష్కరిణి ఉన్నది. తూర్పున దేవాలయ బజారున్నది. వివిధ వస్తువులు కొనవచ్చును ఇక్కడ. దేవాలయమునకు నాల్గువైపులు బ్రాహ్మణ అగ్రహారములున్నవి. దేవాలయపు ఆవరణములో జనము నిండియుండిరి. దూరదేశములనుండి పిచ్చివారు, పక్షవాతము గలవారు, ఇతరులు ఇక్కడ స్వామి దర్శనమువల్ల వారి రోగములు కుదురునని నమ్మి వచ్చియుండిరి. ఈ నమ్మకమున కొక గాథ యున్నది. సత్రయాగము చేసి సర్పములన్నీ అగ్నికాహుతిచేసిన జనమేజయ మహారాజుకు కుష్ఠురోగము వచ్చినదట. ఈ రోగమునకు ఔషధము లేవీ కుదరక శ్రీకృష్ణదేవుని ప్రార్థించెనట. అప్పుడు సముద్రములో మునిగియున్న ద్వారకలోని నారాయణ విగ్రహము దేవగురువయిన బృహస్పతియొక్క, వాయుదేవుని యొక్క సాయమువల్ల ఈ ప్రదేశములో కొనివచ్చి ప్రతిష్ఠించి, బహుకాలము ఇచ్చట తపోనిష్ఠుడయి జనమేజయుడు రోగవిముక్తుడయి యుండెనట. అప్పటినుండి ఇక్కడి కృష్ణ (లేక నారాయణ) విగ్రహమును 'గురువాయూరప్ప' యని ఊరును గురువాయూరని, ఈ దేవుడు పక్షవాతము, ఉన్మాదము, కుష్ఠు మొదలైన రోగములు కుదుర్చునని వేలాది జనము రావడము మొదలయింది.

సాయంకాలము ఐదు గంటలకు 'శ్రీ కోవిలె' నాగస్వరము శ్రవణానందముగా మొదలయింది. బంగారు ఉత్సవ విగ్రహమును అలంకరించిన ఏనుగుమీద ఉంచి శ్రీ కోవిలె చుట్టూ మూడుమార్లు ప్రదక్షిణము భక్తబృందముతో జరిగినది. ఈ ప్రదక్షిణమునకు 'శివేలి' అంటారు. పండ్రెండు దీపములు బట్టుకొని పండ్రెండు ఇళ్ళ అంబలవాసులు (దేవాలయ దాసులు) దారి తీస్తారు. భేరీ మృదంగ కాహళ ధ్వనులతో మిళితమైన నాగస్వరము ఊదుచుండగా మేలశాంతి (ముఖ్య పూజారి), అతని వెనుక ఏనుగుమీద కృష్ణదేవుడు, వెనక నంబూదిరీ బ్రాహ్మణులు, భక్తులు భజనచేస్తూ ముమ్మారు ప్రదక్షిణము చేస్తారు. దీనితర్వాత శ్రీ కోవిలెలో ప్రవేశించితిమి. శంఖధ్వనుల మధ్య గర్భగుడి ద్వారము తెరచి దీపారాధనచేయుట చూచితిమి. ఎంత బాగున్నది విగ్రహము! ఒక్కసారి దర్శనముచేసిన చాలు జీవితాంతము మరుపురాదు ఈ చిరునవ్వు తాండవించు ముఖము. శంఖ చక్ర గదా పద్మపాణియై, నీలమేఘశ్యామల వర్ణముగల సుందర మూర్తి. నారాయణమూర్తి. ఒక్కమారుగా భక్తులందరు 'గురువాయూరప్పా శరణం' అని ధ్వని చేస్తారు. జయదేవ కవియొక్క అష్టపది శ్రావ్యముగా దేవాలయ గాయకుడు పాడిన తర్వాత ప్రసాదము పుచ్చుకొని బయటకు వచ్చితిమి.

దేవాలయము ఉదయము 3 గంటలకే తెరుస్తారు. బ్రాహ్మీ ముహూర్తములో నాగస్వరము వినువారికి తెలియగలదు — ఎంత ఆనందదాయకముగా ఉండగలదో. ఈ ప్రొద్దుకే భక్తులు స్వామి 'నిర్మాల్య దర్శనము'నకు వస్తారు. భక్తులకు దర్శనమయిన తర్వాత విగ్రహమునుండి ముందునాటి అలంకారములు తొలగించి బంగారు పాత్రతో అభిషేకము మేల్‌శాంతి (అనగా ముఖ్య అర్చకుడు) కావించును. తర్వాత మంచినూనెతో అభిషేకమగును. అది తుడచివేసిన తర్వాత శంఖముతో తీర్థాభిషేకమవును. అటు తర్వాత వేయించిన వడ్లు (మలార్) నైవేద్యము. మరల అన్నము నైవేద్యము. ఉదయము 6.30 గంటలకు శ్రీ కోవిలె తలుపులు మూసివేసి ఉషాపూజ (ప్రాతఃపూజ) 7 గంటల వరకు జరిపి మరల దర్శనమునకు తలుపులు తెరచుదురు. అటుతర్వాత శివేలి (ఇంతకు పూర్వము వర్ణించినట్లు ఏనుగుమీద ప్రదక్షిణము జరుగును. ఉదయం 8-30 గంటల నుండి క్షీరాభిషేకము జరుగును. తర్వాత తొమ్మిది వెండి పాత్రములనుండి తీర్థాభిషేకము జరుగును. (నవకాభిషేకము) తర్వాత నైవేద్యము పూజ జరుగును.

మధ్యాహ్నముకూడ ఇట్లే పూజలు జరుగును. ఇట్లు ఉదయము 3 గంటల నుండి రాత్రి 10-30 గంటల వరకు క్రమముగా శాస్త్రీయపూజలు జరుపుదురు.

దేవాలయములో పూజింపవచ్చు జనములో నంబూదిరి బ్రాహ్మణ వనితలే ప్రత్యేకము. తాటి యాకు గొడుగులు పట్టుకొని సన్యాసులవలె తెల్ల వస్త్రములు కాళ్ళనుండి భుజముల క్రిందివరకు కప్పుకొని, ఎవరు ముట్టెదరోయని భయపడుచు దేవస్తోత్రములు పల్లించుచు, గురువారూయప్పను దర్శించు ఈ బ్రాహ్మణ స్త్రీలు చూడదగిన కేరళ దృశ్యములలో ఒకటి. ఈ యాడువారికి ముక్కు, చెవులలో ఏమియుండవు. చెవి రంధ్రములు మాత్రము చాల పెద్దవి చేయబడుటవల్ల ఊగులాడుచుండును. పురాతన కాలములో నంబూదిరీ బ్రాహ్మణులు భూసురులని సంఘములో అత్యున్నతస్థానము కలిగియుండేవారు. ఈ నాడు కూడ వీరికి గ్రామములలో మర్యాద ఇచ్చెదరు.

నంబూదిరీ బ్రాహ్మణులేకాక కేరళ దేవాలయములో ఇతరులకు ప్రాధాన్యము కలదు. పైన చెప్పినట్లు 'శివేలి'లో దీపములు పట్టువారు, దేవవిగ్రహమునకు పుష్పమాలలు తయారుచేయువారు 'కజకికార్' అని పిలువబడుదురు. వీరు వారియర్, పిషరోటి, నంబీశన్ అని పేర్లుంచుకొను 'అంబలవాసులు'. వీరు సర్వదా దేవాలయమందే యుందురు. వీరు ద్విజులు కాకపోయినను ఉచ్చవర్ణముగానే పరిగణింపబడుదురు. వీరూ శాఖాహారులే.

దేవాలయ పూజారులయిన 'మేల్ శాంతి' 'కిజు శాంతి' అనువారు నంబూదిరి బ్రాహ్మలు. కొన్ని కుటుంబములనుండే వీరు తరతరములుగా ఈ వృత్తి నవలంబించుచున్నారు. వాల్గు నంబూదిరి వంశముల నుండే ఈ కోవిలెలో పూజారులు ఎన్నుకొనబడుచున్నారు. ఒక్క సంవత్సర పర్యంతము 'మేల్ శాంతి' ఎన్నుకొనబడును. మేల్ శాంతి అనబడు ఈ ముఖ్య అర్చకుడు ఏడాది దేవాలయము విడచి బయట పోకూడదు. బ్రహ్మచర్యనిష్ఠ నవలంబించవలెను. ఈ దేవాలయపు పవిత్రత ఈ కాలములో కూడ కాపాడబడుచున్నది.

ఈ దేవాలయములో పూజావిధి జగద్గురు శంకరాచార్యులవారు నిర్దేశించిరట. మేల్ పతూరు నారాయణభట్టతిరి అను కవి 'నారాయణీయ'మని అద్భుతమయిన సంస్కృతకావ్యము ఈ దేవుని స్తుతించి వ్రాసినాడు. ఈ కవి గూడ గురువాయూరులో బహుకాలము వశించెనట.

ఈ దేవునికి చేయు నైవేద్యములలో భక్తులకు చాల ఇష్టమయినవి తైలము (అభిషేకమునకు) తులాభారము. భక్తులు నువ్వులనూనె అభిషేకము కొరకు సమర్పించుదురు. విగ్రహము స్పర్శగలిగిన ఈ నూనె అద్భుతశక్తులు కలదగుచున్నది. ఎన్నో రోగములు ఈ అభిషిక్తతైలమునుండి కుదిరినవని జనులు చెప్పుదురు.

"తులాభారము" అనునది భక్తుడు తన బరువు, తూన్చిన వస్తువు స్వామికి నివేదించుట. ధ్వజస్తంభమునకు తూర్పున ఒక భద్రమయిన త్రాసు అమర్చియున్నది. భక్తులు తాము త్రాసులో ఒక పళ్లెములో కూర్చొని రెండవ పళ్లెములో అరటిపళ్లు, బెల్లము కొబ్బరి బొండములు, వెన్న, చందనము మొదలయినవి పెట్టి తూగి అవి దేవునికి నివేదించుదురు. కొన్ని మాసముల క్రితము తులసితో తూగి ఒక భక్తుడు సమర్పించినాడు. తన బరువంత తులసి దళములు ఎంతో కష్టముతో స్వీకరించెనట.

కేరళ దేశమునకు వచ్చినవారు కేరళ "తిరుపతి" అయిన గురువాయూరు చూడ మరువరాదు. దేవాలయపు గోడలపైని ఉన్న చిత్రలేఖనములు కూడ ఎన్నదగినవి.

ఇట్లు గురువాయూరు దర్శించుకొని తిరుచూరు పురమునకు వెనుదిరిగితిమి.

## 2. తిరుచూరు

తిరుచూరు కేరళ దేశమునకు కేంద్రమని ప్రతీతి. పట్టణము 'వడక్కునాథన్' అని పిలువబడు ఈశ్వరుని దేవాలయము చుట్టూ నిర్మితమైయున్నది. ఈ దేవాలయము ఇప్పుడు ఎత్తైనస్థలములో ఊరిమధ్య కోట (fort) లో ఉన్నది. ఈ ఎత్తుప్రదేశము పూర్వము పర్వతముగా ఉండెడిదట. ఇప్పటికీ ఈ ప్రదేశము పురాణప్రసిద్ధమయిన 'వృషభాద్రి' అని జనుల నమ్మకము. భగవదవతారమయిన పరశురాముడు ఈ శివలింగ ప్రతిష్ఠాపన చేసినాడట. ఈ దేవాలయపు ఆవరణములోనే ఒక కృష్ణదేవాలయము, ఒక శంకర

నారాయణ రూపియగు విగ్రహము ఇచ్చట చాల సుందరముగా నున్నది.

ముఖ్యముగా ఈ దేవాలయపు గోడలపైని చిత్రలేఖనములు అతిరమ్యమయినవి. కాలదోషమువల్ల చిత్రములు మాసిపోతున్నవి. కాని చాల చిత్రముల నకళ్లు తిరుచూరు చిత్రశాలలో ఉంచబడియున్నవి.

మహాభారతములోని దృశ్యాలు శంకరనారాయణ కోవిల గోడలమీద ఉన్నవి. యుద్ధసన్నద్ధులయిన భీష్మ, ద్రోణ, జయద్రథ కృపాచార్య, అశ్వత్థామలను చూడవచ్చును. అర్జునుని రథముమీద సారథిగా కృష్ణుని చూడవచ్చును. భగవద్గీత దృశ్యమన్నమాట. తర్వాత విశ్వరూపదర్శన పటమున్నది. భగవంతునికి ఐదు ముఖములు (శ్వేత, అరుణ, నీల, మరకత, కుంకుమ వర్ణములు) నాల్గు చేతులు చూపబడియున్నది. చుట్టూ ముకుళిత హస్తములతో మహర్షులు, సిద్ధులు, భీష్మ, ద్రోణాచార్యులు, పాండవులు, నారదమహర్షి, అర్జునుడు ఉన్నారు. ఈ దృశ్యము తర్వాత మోహవిముక్తుడయిన అర్జునుడు యుద్ధము చేయుట చూపించబడినది. యుద్ధ దృశ్యములు బాగున్నాయి. ఎన్నదగినవి ఘటోత్కచుని మాయాయుద్ధము; భీమ భగదత్తుల సమరము. భీష్మార్జున సంగ్రామము (శిఖండి వచ్చు దృశ్యమువరకు) తర్వాత శరతల్పముమీద భీష్ముడు.

వడక్కునాథుని (శివ) దేవాలయపు గోడలమీద; శ్రీకృష్ణ కోవిలమీద శిల్పము రామాయణ గాథా చిత్రములు; కృష్ణ బాల్యదృశ్యములు సుందరమయినవి, చూడదగినవి.

ఇక తిరుచూరు పట్టణములో చూడదగినవి పురాతనవస్తు ప్రదర్శనశాల (Museum), జంతు గృహము, (Zoo), చిత్రశాల (Art gallery), పదునాల్గు మైళ్ళ దూరములోనున్న పీచీ అను మనాలి నదిపై 750 అడుగుల పొడవుగల ఆనకట్ట చూడదగ్గ ప్రకృతి సౌందర్యస్థలములలో నొక్కటి.

# మర్మగుహ

శ్రీ సి. సి. పున్నయ్య



(గతసంచిక తరువాయి)

రాఘవరావు:_బాగుంది! వాడు నా కుమార్తెమణి మన యింట్లో నున్నదనిచెప్తే పోలీసులు మన యింట్లో జొరబడడానికా! ఇంతకాలం యూళ్ళో ఏదో గౌరవప్రతిష్టలతో బ్రతుకుతున్నాము. అవి కాస్తా యీ పిల్ల మన యింట్లోనుంటే బుగ్గిపాలై పోతవి.

మహాలక్ష్మి:_(ఆలోచించి) అదీ నిజమే,

రాఘ:-ఇంక ఆలోచన ఎందుకు? వెంటనే ఆమెను పంపేసెయ్యి.

మహా:-మణీ! మణీ!

నాగమణి:-(వచ్చి) ఏమిటమ్మగారూ!

రాఘ:_ఏముందీ! - మీ నాయన బ్యాంకిలో దొంగతనంచేసి జైలుకెళ్ళాడని పేపరులో పడింది.

మణి:-అబద్ధం! మా నాయన అటువంటివాడు కాడు.

రాఘ:_అదేమిటమ్మాయ్! అలాగ మాట్లాడుతావు! యిదిగో పేపరులో చూడు!

మణి:_పేపరులో పడేవార్తలన్నీ నిజమని మీ యభిప్రాయమా! పొరపాటు.

రాఘ:-ఏది ఎట్లైనా నీవిక మాయింట నుండటం పనికిరాదు.

మణి:_అమ్మగారూ! మీరు, అయ్యగారు మా నాన్నతో యిక్కడ నన్నొప్పజెప్పిపోయేటప్పుడు తల్లిదండ్రులులాగ ఆదరిస్తామని చెప్పారుగదా _

మహా:_ఇకమీదట దానికవకాశం లేదు.

మణి:-ఇందులో నా నేరమేమిటి తల్లీ!

మహా:_నీవింతవరకు మంచిగానున్నా మీ నాయన దొంగ - మరి నిన్నిక నమ్మడం మంచిదికాదు.

మణి:-మా నాయన ఎన్నటికీ దొంగతనం చేసి యుండడు.

రాఘ:-అవును - నీవు మాత్రం అతని బిడ్డవు కదూ! దొంగఅయిన అతనిని సమర్థించక మరేంచేస్తావు!

మణి:_బాబుగారూ! తొందరపడకండి. మీరింత కాలం దయతో ఆదరించినందుకు నమస్కారములు. కాని యిప్పుడుమాత్రం తొందరపడి మాట్లాడుతున్నారు. అయినా నా రోజులు మంచివికానప్పుడు...

రాఘ:_సరే - యిక వెళ్లిపో!

మణి:-ఇదిగో వెళుతున్నాను. మేముండి జీవయాత్ర సాగింపవలసిన స్వంతయిల్లే స్మశానమైపోగా యిది నాకు శాశ్వతమా! నా తండ్రి నిర్దోషి, ఉత్తముడు. నాకోరకనే యింతకాలం జీవించిన వాడు. ఏదోవిధంగా వంచింపబడి దుర్గతిపాల య్యాడు కాని మీరనుకున్నట్లు నీచుడు కాడు. బాబుగారూ! మా నాయన నీతినియమాలకు దూరమయి దొంగతనమునే జీవనోపాధిగా స్వీకరించినట్లయితే మేమీపాటికి మిద్దెల్లో, మేడల్లో హాయిగా నుండేవాళ్ళమేమో! నేను మీ పంచ చేరవలసిన అవసరముండేదికాదు. అమ్మగారూ! నేనే నీ కుమార్తెనయినట్లయితే నన్ను యిల్లు పదలి పొమ్మనకలిగేదానివేనా! మీ మాతృహృదయం ఏ స్థితిలోనుండేదో ఆలోచించండి! స్త్రీగా పుట్టి యీడొచ్చిన నన్ను అనాథనని తెలిసికూడ సానుభూతిలేకుండా వెళ్ళకొడుతున్నారు. నేను ఎవరికొరకై బ్రతుకాల్సి యున్నదో ఆయననే వెతుక్కుంటూ వెళతాను. నిజం బయటపడ్డ తరువాతైనా మమ్ములను గురించి తెలుసుకుందురుగాని! బాబుగారూ! అమ్మగారూ! వెళ్లివస్తాను - నమస్కారాలు (వెళ్ళిపోవును).

◆ ◆ ◆

(జమీందారుగారి భవనం - వంటయింట్లో వల్లి పనిచేసుకొంటుంటుంది. రాగయ్య ఆయాసంగా వచ్చి చిందులు త్రొక్కసాగాడు.)

రాగ:-పాము! పాము! అబ్బ! ఎంత పెద్దపాము (అరుస్తాడు).

వల్లి:-(భయభ్రాంతురాలై లేచివచ్చి రాగయ్య రెండు చేతులు గట్టిగా పట్టుకొని) ఎక్కడ! ఎక్కడ!

రాగ:_ఎక్కడేమిటి! (లాలనగా) చాల భయపడినట్లుంది పాపం! అది _ నిన్న చిన్నబాబు, నేను అడవికి వేటకు వెళ్లాంకదూ! - అక్కడ ఒక పెద్దపామును...

వల్లి:-(రాగయ్య చేతులు వదలిపెట్టి తొలగి నిలబడి) ఛీ! బలేవాడివి. నీవూ ఒక మగవాడివేనా!

రాగ:-ఏం! నీ కండ్లకు నేను మగవాణ్ణిగాకాక ఆడదానినిగా కనిపిస్తున్నానా ఏమిటి! (ముసిముసినవ్వుతో) అప్పుడు వల్లిని సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఏనుగను చూపి తన మార్గానికి త్రిప్పుకున్నాడు; యిప్పుడు...

వల్లి:-బలే తెలివి! యిప్పుడు పాము అని భయపెట్టి - నీ ముఖం నీవూను!

రాగ:-ఏం! నా ముఖం నీకు నచ్చలేదా! ఏదో పిల్లవు కదాయని చూస్తుంటే మహాశకలు పోతున్నావే!

వల్లి:-ఇదిగో చూడూ - నీవిలా పిచ్చిపిచ్చి పోకడలు పోయావంటే అయ్యగారితో చెప్పేస్తాను.

రాగ:-మరీమంచిది! పెదబాబుగారు మాత్రం మనిద్దరం పెళ్లిచేసికొని, చిలుకాగోరంకల్లాగ...

వల్లి:-నీ ముఖానికి అది ఒక్కటే తక్కువ! యిప్పుడిక్కడినుండి కదులుతావా లేదా!

(జమీందారుగారు 'రాగయ్యా! రాగయ్యా!' అని పిలుస్తూ వస్తారు.)

రాగ:-(ముందుకువెళ్ళి తడబడుతూ) బాబుగారూ! వస్నా!

జ:-చిన్నబాబేడిరా?

రా:-ఇందాక తోటలో నున్నారండి.

జ:-నిన్న వేటకెళ్ళి జింకను తేలేదా?

రా:-జింక దొరకలేదు బాబుగారూ!

(శివప్రసాద్ వస్తాడు)

జ:-జింక దొరకలేదుట కదూ!

శివ:-అవును నాన్నగారూ! రేపు వెళ్ళినప్పుడు పట్టుకొస్తాము.

జ:-అలాగేలే - రా పోదాం లోపలికి.

(శివప్రసాద్, జమీందారు లోపలికి వెళ్లెదరు.)

రాగ:-వల్లీ! వల్లీ!

వల్లి:-ఎన్నిసార్లు చెప్పాలి! వల్లి, గిల్లి యని పిలువవద్దని.

రాగ:-(తలగోక్కుంటూ) ఆ - మరచిపోయాను - యిదిగో చూడు... మనకీ స్తమానం యీ కీచులాట బాగలేదు. మనమిద్దరం ఒక అయ్యదగ్గర పని చేస్తున్న వాళ్ళం-అవకాశమున్నంతవరకు అచ్చట్లు, ముచ్చట్లతో కులాసాగాయుంటే బాగుండదూ!

వల్లి:-అఘోరించినట్లుంటుంది.

రాగ:-ఏమిటీ అంటున్నావూ -

వల్లి:-చాల సోయగంగా నుంటుందని.

రాగ:-అలా రా దారికి.

వల్లి:-ఇదేమిటీ పారాయణం - పనిపాటులు లేకుండా!

రాగ:-వానికేంలేగాని (వల్లికి సమీపంగా వెళ్ళి) మన బోటివాళ్ళకు ఏది ముఖ్యంగా కావాలో తెలుసా!

వల్లి:-(మూతి ముడుచుకొని) నాకవన్ని తెలియదు.

రాగ:-పరస్పరం ప్రేమ, సరసము...

వల్లి:-కనిపెట్టావే!

రాగ:-వల్లీ! మొన్న బావిదగ్గర నీళ్లుతోడుతూ పాడావే - ఆ పాట - ఒక్కసారి పాడుదూ!

వల్లి:-నీకూ తెలుసుగా! నీవే పాడు.

రాగ:-మనకిద్దరికీ తెలుసుకాబట్టి యిద్దరం కలసి పాడదాం.

(ఇద్దరూ ఉల్లాసంగా పాడుతూవుండగా ఎవరో వస్తున్నట్లు చప్పుడుకాగానే పాట ఆపేసి రాగయ్య వెళ్ళిపోయాడు. వల్లి దిక్కులు చూస్తూ నిలుచుంది.)

♦ ♦ ♦

(చెరసాలలో రాజయ్య తలుపు చువ్వలను పట్టుకొని వాపోవుతుంటాడు.)

రాజ:-నేను దోషినట! పొరబాటు - నా బిడ్డ మణి కూడ నన్ను దోషిగానే ఎంచుతుందేమో! మణీ! నీ తండ్రిని న్యాయస్థానం దొంగయని తీర్పుచెప్పి చెరసాలకు ఒప్పజెప్పింది. బ్రతుకుతెరువుకని వెతుకులాడబోతే గంపెడు దుఃఖం లభించింది. ఆకలితో సొమ్మసిలి నిద్రపోతున్న నాకు దొంగ అలికిడి వినిపించి అతనిని డబ్బు సంచులతో సహా పట్టుకుంటే లోకులు నన్నే దొంగగా నిర్ణయించారు. న్యాయం నిర్ణయించడానికని న్యాయస్థానానికి తీసికెళ్ళితే అక్కడ న్యాయం మచ్చుకైనా కనుపించలేదు. నీతినియమాల ఉద్ధరణకు మార్గదర్శకాలు కావలసిన న్యాయస్థానాలు బూటకాలుగానున్నవా యనిపిస్తున్నది. న్యాయమూర్తి నన్ను దోషిగా నిర్ణయించి శిక్షించాడు. నన్ను తెలిసిన ఏ కొద్దిమందో తప్ప మిగిలిన లోకమంతా నన్ను దొంగయనే అంటున్నది-బాధ... దొంగిలించి, దోచుకొనిపోవ సమకట్టినవాడు ఏమి ఎరుగనివానివలె తిరుగుతున్నాడు. నిజానికి పాటుపడ సాహసించినందుకు నాకిది ప్రతిఫలం. దొంగ వికటమందహాసం చేస్తున్నాడు అంటే దొంగను పట్టుకోచేతకాక అమాయకుని చెరసాలకు పంపారనే కదూ! ఈ ప్రహసనంలో నేనే చరసాల కర్పితమయ్యాను. మరి నీవు... ఎలాగున్నావో తల్లీ! నీవైనా సుఖంగా గౌరవప్రదంగా జీవించు! బ్రతికి బయటపడితే వస్తాను (కండ్లనుండి నీరు కారుచుండును).

(సశేషము)



# కళద్వారా జాతి అభ్యుదయాన్ని ప్రోత్సహించండి!

## వాణిమహాలులో ప్రసిద్ధ హిందీ నటుడు బాలరాజ్ సహానీ అభిభాషణ!

ఈమధ్య బాలరాజ్ సహానీ మద్రాస్ వచ్చారు. వారి గౌరవార్థం మద్రాస్‌లోని ఇండియన్ పీపుల్స్ థియేటర్స్ ఎసోసియేషన్ వారి ఆధ్వర్యాన్న వాణీ మహాలులో 14-10-60 న సమావేశం జరిగింది. తమిళ స్టేజీ-స్క్రీన్ నటుడు శ్రీ సహస్రనామం అధ్యక్షత వహించారు. దక్షిణభారతపు వివిధ భాషలలో ప్రార్థనలు జరిగాయి. మన అభిమాన నటుడు శ్రీ గుమ్మడి సహానీకి పట్టుశాలువలు కప్పి పూలమాలలు వేసి తనకు సహానీ పట్లగల పూజ్యభావాన్ని ప్రస్ఫుట పరిచారు. ఆయన ఉపన్యాసంలో తనకు బాలరాజ్ సహానీతో ఏర్పడిన పరిచయాన్ని వివరిస్తూ శ్రీ సహానీ ఉత్తమ కళాకారుడూ, విశాలదృష్టి కలవాడూను అన్నారు. ఉత్తమ నటుడుగా ఆయనలోని సరళత్వము, సహజసౌమ్యతలు, విజ్ఞత కళాకారులకు శ్రీ సహానీని ఆదర్శమూర్తిగా రూపొందించినవన్నారు. శ్రీ ఇంటూరు వెంకటేశ్వరరావు థియేటరు ఉద్యమం పునరుద్ధరణ కావడం కళాపిపాస, ఆరాధనలకు తోడ్పడగలవన్నారు.

'నటన' కళా; శాస్త్రమా అనేది నాకింకా తెలియదు. పరదేశంలో నటించాను. మా దర్శకుడు రష్యన్ దేశస్థుడు. వారికి రష్యన్ భాష మాత్రమే తెలుసు. మాకు అదిమాత్రము తెలియని భాష. అయినా భావుకత ప్రాధాన్యత వహించే యీ నటనకు భాష అంతరాయంగా లేకపోయింది.

కాని మనదేశంలో ఆర్టిస్టులంతా సామాన్య ప్రజకు, సహజ సాంఘిక వ్యవస్థకు నానాటికీ దూరమైపోతున్నారు. "నావలనే ఆ చిత్రం విజయం సాధించింది. నా నటన శిఖరాగ్రాలను చేరింది. నేను చాల పెద్ద నటుణ్ణి" అనే భావం నటీనటులకు వచ్చిందంటే అది చాల ప్రమాదకరమైన పతనానికి దారి తీస్తుంది. సినిమా అనేది ఏ ఒకరి నేర్పుతోనూ విజయవంతం కాలేదు. అది ఉమ్మడి సొత్తు - సమిష్టి కృషి- సహజ విజ్ఞానరీతి. నేను గొప్పగా నటించగలిగిన నటుణ్ణే అయితే నేను నటించిన చెత్త చిత్రాలెందుకు విజయవంతం కావు? మానవులకు కోరికలుండవచ్చు. జీవితంలో ఏదో సాధించాలనే తపన కలిగినా తప్పు లేదు. కాని జీవిత ప్రమాణాలను మరో లోకానికి చేర్చి, తారలుగాను, దేవతలుగాను, నటీనటులు మారిపోరాదు. జీవితానికి ఒక ధ్యేయం కావల్సిందే! పరమావధిలేని ప్రయోగంతో జీవితాన్ని ఎడారి చేసుకోవాలని ఎవరూ యోచించరు.

మనదేశానికి దేముళ్ళు చాలమందైపోయారు. శ్రీరాముడుకో నమస్కారం పెట్టి ఒక కోరిక కోరుతాం. అది సఫలంగాదు. వెంటనే ఏ వెంకటేశ్వరస్వామినో తలుస్తాం. అపుడూ అది నెరవేరకపోతే ఏ సంతాన గోపాలస్వామినో వేడుతాం. ఇల్లా దేముళ్ళను చేయడం, వారి మహత్తును తుత్తునియలు చేయడం మంచిదిగాదు. అది గ్రహించండి. ఈనాడు మీ నటన బాగుందని అందలాలెక్కించిన ప్రజ, మీరు నటించిన తర్డురేటు చిత్రంచూచి చివాట్లు పెట్టకపోరనేది గుర్తించండి.

మనలో చాల లోపాలుంటాయి. కాని వాటిని హద్దులు దాటనియ్యకండి. మనలో ఎవరమూ పూర్తి నిష్కళంకులంగాదు. అట్లాంటపుడు యీ 'ఆరాధన' కెందుకు స్థానం కలిగించాలి? మనంగూడా మనుష్యులమే! అందుకే మనమంతా కలిసి మనాలి. జీవితాలను ఏకంచేయాలి.

అదే 'ఇప్టా' చరిత్రకు పునాది. ఇది నేను ప్రారం

భించిన సమితిగాదు. 5, 6 వందల సంవత్సరాల క్రితమే మన భక్తకవుల సృష్టి. ఏ భాషవారైనా, ఏ ప్రాంతీయుడైనా, నానక్ అయినా, శంకరాచార్య అయినా, వారు వారి వారి ప్రాంతాల్లో మాత్రమే గూడుకట్టుకొని కూర్చోలేదు. దేశమంతా తిరిగారు, వారికి పంజాబు, మద్రాస్ ఒకటే అయింది. కాని వారు 'నేర్చుకోవాలి' అని పర్యటించారు. పర్యటనలో గడించిన అనుభవాలను అందరికీ తెలియజేసారు.

అదే మన సంస్కృతికి మూలం. మన సాంఘిక జీవనానికి నాంది. మన రసహృదయాల కోక రమణీయ స్పందన. మీమీ సంస్కృతిని చూచి గర్వించండి కాని యితర సంస్కృతిని యీసడించకండి. శంకరాచార్య సుభాషితాలు పంజాబీ గురు గ్రంథంలో వున్నాయి. అల్లాగే అన్ని ప్రదేశాల లోను మంచిని మంచిగా స్వీకరించి అనుసరించడం ఆచారం. అదే 'ఇప్టా' ఆశయం.

మనది మొఘల్ ప్రభువుల మూకుమ్మడి ప్రయోగం కారాదు. మేము ప్రభువులం - అందుకే మా దేశప్రజలంతా మా భాషే మాట్లాడాలనడం సబబు కాదు. అది ఐక్యతను చేకూర్చలేదు. అదే బ్రిటిష్ ఇంపీరియలిజం చేసిన తప్పుగూడా. అందుకే ఆ యా ప్రభుత్వాలు నిష్క్రమించాయి. ఇపుడు దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది.

సినిమాలు వచ్చి నాటకాలను పడగొట్టేశాయనే మాట తరచు వినవస్తోంది. ఇది చాల సిగ్గుచేటయిన మాట. నాటకాలు ప్రదర్శించేవారి లోట్లన్నీ సినిమాలకు అంటగట్టడం సబబుకాదు. ప్రజావాహినిని చూడండి. వారి వాణిని వినండి. వారికి కావలసినది ప్రదర్శించండి. ముందడుగు, మా భూమివంటి నాటకాలు మళ్ళీ దేశసౌభాగ్యం కోసం రచించండి. పల్లె పల్లెనా ప్రదర్శించండి. ప్రజలకు మన ప్రభుత్వానికి మరింత సన్నిహితం కలిగించండి. మన ప్రధాని నెహ్రూ పండితుని పంచశీల పరమరహస్యం ఏమిటో, శాంతి కృషి ఎల్లాంటిదో, ప్రపంచపు నేటి తీరుతెన్నులేమిటో, అన్నీ సామాన్యప్రజ కంద చేయండి. ప్రజానాట్యమండలిగా నాటకాలు ప్రదర్శించండి. అది చాల ముఖ్యం. సినిమా నటీనటులంతా వారివారి బంగారు భవనాలు వదలి బయట ప్రపంచాన్ని చూడాలి. ప్రజల అవసరాలు గుర్తించాలి. ప్రభుత్వ పథకాలు అర్థంచేసుకోవాలి. కళాకారులు దేశ సౌభాగ్యానికి మూలకారకులుగా రాణించగలగాలి. 'సడక్ కె కినారే' అనే నాటకంలో చాకు ప్రవేశార్హత కలిగింది. ఆ నాటకమే 'హంలోగ్' చిత్రంగా తయారయింది. సామ్యవాద దేశాలలో నాటకాలు ప్రభుత్వం అజామయిషీలో అభివృద్ధి పొందుతునే వున్నాయి. ఇంపీరియలిస్టు దేశాలైన ఫ్రాంస్, అమెరికా, ఇంగ్లండువంటి దేశాలలో గూడా నాటకకళ మంచి అభివృద్ధిలో వుంది."

అంటూ ఎన్నో వివరిస్తూ ప్రతి కళాకారుడు ఆత్మవిమర్శతో తన నటజీవితాన్ని నడపడం ముఖ్యమని హెచ్చరిస్తూ బాలరాజ్ సహానీ తన ఉపన్యాసం ముగించారు.

శ్రీయుతులు బి. యన్. రెడ్డి, ఎల్. వి. ప్రసాద్, అజిత్ సింగ్, జి. వరలక్ష్మి, రామినీడు, రాఘవయ్య. సుబ్బారాయుడు (ఫ్లడ్ లైట్) రాజేంద్రప్రసాద్, జమున మొదలగువారు సమావేశంలో పాల్గొన్నారు.

♦ ♦ ♦

నార్త్ మద్రాస్ ఆర్ట్స్ అకడమి (రిజిస్టర్డు) వారి యాజమాన్యమున మద్రాసు భారతీయ నాట్యకళా మండలివారు రాజా అణ్ణామలై మందిరమున 24.10-60 న 'పాండవవిజయము' నాటకమును ప్రదర్శించిరి. ఇందులో శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి, పులిపాటి వెంకటేశ్వర్లు, వేమూరి రామయ్య, యం. సీతారామ నాథశాస్త్రి, వంగర వెంకటసుబ్బయ్య, యం. ఆర్. తిలక్ మున్నగువారు నటించారు.

నాటకం మొత్తంమీద రక్తికట్టినా లోపాలు కూడ కనుపించినవి. పద్యాలుపాడే సందర్భాలలో తరచుగా అపస్వరాలు చాల చీకాకుపరచినవి. నటనాకౌశలములో వివిధపాత్రలు మేలుగా పోషించబడినవి. మరింత ఆసక్తితో కృషి చేసియున్నచో నాటకము యింకా రాణించియుండేది.

నాటకకళ అభివృద్ధికి భారతీయ నాట్యకళా మండలివారు శ్రీ యం. ఆర్. తిలక్‌గారి నాయకత్వమున జరుపుచున్న కృషి అపారము. ఆయన కళాపిపాసిగా, నటుడుగా నాట్యకళామండలి ఉత్తమ కళాకేంద్రంగాను, శిక్షణకేంద్రంగాను రూపొందగలదని ఆశిద్దాము.

(560వ పేజీ చూడుడు)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



౭౫

భక్తుఁడెవ్వఁడు శ్రీరామ భద్రమూర్తి
నాశ్రయించి, సేవించునో యతఁడె రామ
మూర్తియగు; దీనసంశయము బనిలేదు;
తలఁప దండ, కమండలధారి భక్తుఁ
డా రఘుపతి - కోదండ తూణీరధారి

౭౬

పాపతిమిరంబుఁ బాపెడి భాస్కరుఁడవు
నీదు పాదపద్మముల, మన్నించి, యందు
దాఁకు-మధుపానుచుండెడి తుమ్మెదను; క
లియుగ మఘములకు నెలవు; భయము
గలిగె.
నీదు క్రేగంటిచూపుల నెమ్మినను, న
నుగ్రహింపంగ శ్రీరామ! నోమొనర్తు.

౭౭

పామరులు గూడ, "శ్రీరామ-రామ"
యంచు
జపము సల్పుమాత్రమున, సంసారజలధి
దాటుచుండ్రు; నీ వ్రేలిముద్రను ధరించి,
హనుమ, సంద్రంబు దాఁటుట-యబ్బురంబె?
రామ! శ్రీరామ! గుణధామ! రమ్య
నామ!

౭౮

శ్రీరామ నామంబు - చింతించువారి
కమృత బీజంబయి, యఖిలార్థసిద్ధి
నిచ్చు; సంజీవనంబిద్ది: ఈ రామ
నామామృతంబొందు నాలుకనున్న
కాలకూటముగాని - కాలాగ్ని కాని
మృత్యుదేవతగాని - సత్యంబుగాఁ
భక్తునిఁ జెనకక - వ్యర్థమైపోవు;
శ్రీరామ! నినునుతిసేయంగ వశమె?

౭౯

"హే! కృష్ణ! హే! హరీ! హే!
అచ్యుతానంద!
హే! కృపావారిధీ! హే! ముకుంద!
పాండవ సన్మిత్ర! పతితపావనరూప!
యెక్కడనుంటివో యెఱుఁగనయ్యా!
దుర్యోధనాదులు - దుర్మదాంధులగుచు
నాకవమానంబు ప్రాకటముగ
చేయుచున్నారు; నా చీరలూడ్చినవారు
వారి పాపంబులు - పండెగాన
ఆర్తరక్షణ! నను గావుమయ్య! భక్త
వరద!" యంచు, ద్రౌపది వేడ, వలువ లక్ష
యముగ, నొసఁగి రక్షించిన హరి! రమేశ!
రాఘవేశ్వర! జోహారు! రామచంద్ర!

౮౦

నల్లగలువ రేకులవలె - నల్లనైన
దివ్యమూర్తివి; బహుచంద్రదీప్తి మెఱయు
మొగముగల్గిన శ్రీరామమూర్తి! కోటి
మన్మథాకార! నాదు నమస్సులివిగో!

(సశేషము)

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వెంకటకృష్ణశర్మ

(అగస్టు సంచిక తరువాయి)

ప్రపంచమున కంతటికి మహాప్రళయాంతకమగు విపత్తు సంభవించినప్పుడును హింసాపూర్వకమగు అక్రమము చెలరేగినప్పుడును, ప్రజలకు దైవవిశ్వాసము తొలగినప్పుడును– మహాత్ములు, యోగివర్యులు ఉద్భవించి ధర్మసంస్థాపనము చేయ సమకట్టుదురు. వారనార్యమార్గమును విధ్వంసమొనర్చి, లోకుల హృదయములలో భగవద్భక్తిని నెలకొల్పఁ బూనుకొందురు. బాబరు భారతదేశముమీదికి దండెత్తి వచ్చునప్పటికి అది మిగుల దుస్థితియందుండెను. అతని సేనలు పట్టణములపైఁ బడి ప్రజలను చిత్రవధల కగ్గపఱచి, దోపిడితనము నిరాఘాటముగ సాగించిరి. బంధితులనుగ అనేక యోగిపుంగవులను చెఱసాలల పాలొనర్చి, వారిచే దుర్భర క్రూర కార్యములను జేయించిరి. పాలకులు కఠినాత్ములై ప్రజోపద్రవ కార్యములకుఁ గడంగిరి. హైందవమతాచారముల నాపివైచిరి. తుఱకల మతకర్మలకుఁ బ్రాధాన్యము గలిగించిరి. మానవుల హృదయములలో అసత్యములు, కుయుక్తులు, స్వార్థపరకార్యములు, పేరాసలు నిండి నిబిడీకృతములయ్యెను. అట్టిసమయమున, భారతదేశచరిత్రలో ఒకమహాపురుషుఁడు, సంకటములెల్ల నిర్మూలింపఁదగు శక్తిసంపన్నుఁడు అవతరింపవలసిన యావశ్యక మత్యంతప్రధానమయ్యెను. జనులలో దైవభక్తిప్రపత్తులు గలిగి- సౌహార్దము, సామరస్యము, ఐకమత్యము, ప్రశాంతభావము చిగిరింపఁజేయగల గురునానకు మహాశయుఁడు ఉదయించెను. హిందుమహమ్మదీయుల తీవ్రవైషమ్యములు రేకెత్తి, యిరుతెగలు నిరంతరకలహములలో మునిఁగియున్నట్టి తరుణమునఁ, దలతోఁకలేని సిద్ధాంతముల నాధారపఱచుకొని నిష్ప్రయోజనములగు కర్మలతో ఆత్మోద్ధరణమునకై యెవరిమట్టుకు వారు ప్రయత్నించుచున్న కాలమున నానకువంటి దైవాంశగల పుణ్యపురుషుఁడు జన్మించుట శుభావహమయ్యెను. అతఁడు ప్రశాంతజీవనమువార్తను, పరస్పర మానవ సౌభ్రాతృత్వమును, ఉత్తమ ప్రేమత్యాగగుణోన్నతినిగూర్చి ప్రపంచమునఁ బ్రబోధించుటకయి యేతెంచెను.

నానకు ఖాత్రితెగకు సంబంధించిన నిగూఢప్రవర్తనముగలవాఁడు; పండితుఁడు; కవి. సిక్కుమతస్థాపకుఁడు. రావీనదీతీరమందలి 'తాల్వంది'– యను గ్రామమున అతఁడు క్రీ.శ. 1469-వ యేట జన్మించెను. ఆగ్రామము పాంచాలరాష్ట్రములోని లాహోరుమండలమునఁ గలదు. అతఁడు పుట్టిన గృహముండినచోటఁ బ్రకృతము ప్రఖ్యాతివహించిన 'నాన్ఖానాసాహెబు'– నెలకొనియున్నది. పాంచాలసింధుదేశములలో అతడు గొప్ప ప్రవక్తగఁ బేరొందెను. సర్వసామాన్యముగఁ బౌరులచే "కాలు" అను నామముతో వ్యవహరింపఁబడుచుండిన "మెహతా కాలూచాంద్" అను గ్రామకరణము అతని జనకుఁడు. కాలూచాఁద్ కరణీకమునేగాక వ్యయసాయమునుగూడ వృత్తిగాఁ గలవాఁడు. నానకు తల్లి "తృప్త" అతఁడు బాల్యదశనుండియే కడు రహస్యప్రవృత్తిని గలవాఁడై యిచ్ఛవచ్చినట్లు సంచరించెడివాఁడు. సాధారణముగ అతఁడు ఎడతెగక సాధువులతోఁ గలసిమెలసి తిరుగుచు, భగవత్తత్త్వమును గూర్చియు, ఆత్మస్వరూపమునుగూర్చియు వారు చర్చించుకొనుచున్నపుడు అత్యంతశ్రద్ధాళువై యాలకించెడివాఁడు. అతఁడు ధ్యానసమాధిగతచిత్తమును భక్తిప్రపత్తియుత స్వభావమును, ప్రత్యేకసదభ్యాసములను అలవఱచుకొనెను. ప్రాణధారమునకుమాత్రమే కొలఁదిగ భుజించుచు ఎక్కువకాలమును ధ్యానమునకును, ఆత్మాన్వేషణమునకును వినియోగించెడివాడు.

విద్యార్జనకయి నానకును ఏడవయేట అతని తలిదండ్రులు హిందీభాషాధ్యాపకుఁడగు "గోపాల్ పండా" అను నతనికడ వదలిపెట్టిరి. అతఁడు నానకు చేతికొక పాఠ్యగ్రంథమునిచ్చి చదువుమనఁగా, "ఇందు ముఖ్యముగా గ్రహింపఁదగిన విషయము తప్పఁ, దక్కినవన్నియు నున్నవి. భగవంతునిగూర్చి తెలిసికొనఁదగు మార్గమీపాత్రమున ఎందును గానరాదు" అని యనెను. గురుఁడు హిందీఅక్షరముల నొకకొయ్యపలకపై వ్రాసియిచ్చి దాని నేర్చికొమ్మని నానకునకు ఆనతిచ్చెను. ఆబాలుఁడు ఉపాధ్యాయుని ఒకనాఁడు "గురూజీ, తామేయేగ్రంథములు చదివితిరి? వానివలన మీకేలాటి విజ్ఞానము ఆర్జింపగలిగితిరి?–" అని ప్రశ్నింప. అతఁడు "నాకు గణితశాస్త్రము కరతలామలకము. వర్తకవ్యాపారములు

గొనసాగించుటకు ఉపయుక్తములగు లెక్కలెల్ల నాకుఁ జక్కఁగఁ దెలియును" అనెను. అంత నానకు "ఈ విజ్ఞానము శాశ్వతమగు మోక్షసామ్రాజ్యమును సాధించుటకు ఏమాత్రము ఉపయోగింపదు." ఈ రీతిఁ బలికిన యాచిఱుతబాలుని మాటలకు పండా మిగుల నాశ్చర్యపడెను. "నానక్, నాకు ముక్తి మార్గము లభించుటకుఁ గర్తవ్యమేదియో చెప్పుము" అని ఆయాచార్యుఁడడిగెను. "గురూజీ, ఐహిక వ్యామోహములను గాల్చి బూదియొనర్పుఁడు. ఆ బూదిని సిరాగా మార్చికొనుఁడు. విజ్ఞానమును చక్కని కాగితము చేసికొనుఁడు. దానిపై ఏకాగ్రత యను కలములో పారమార్థికమును సాధింపఁదగు లెక్కలను వ్రాయుఁడు. (అనఁగా భగవత్తత్త్వమును పొందఁదగు గణితసోపానములను వ్రాయుఁడనుట) అందులకుఁ దమగురు వొసంగు సలహాల ననుసరింపుఁడు. తదనుసారము ధ్యానయోగము నవలంబింపుఁడు. విద్వాంసులగు తాము భగవద్వర్ణన మొనర్పుఁడు. ఆయన స్తోత్రములు రచింపుఁడు. ఆయన ఒకపరిమితికి లోఁబడినవాఁడు గాఁడు. "అణోరణీయాన్, మహతో మహీయాన్" అని ఆయననుగూర్చి భక్తులయిన వారు వచింతురు. గురూత్తమా, భగవత్తత్త్వమును గూర్చి గణించుటయు గణితశాస్త్రమే. ఇది మీరెఱుంగనిదికాదు. అభ్యాసమొక్కటే లోటనిపించుచున్నది"— అని యాబాలుఁడు వాకొనెను. ఆపిల్లవాని పరతత్త్వవిజ్ఞానసంపద కాయధ్యాపకు డాశ్చర్యచకితుఁడయ్యెను.

తరువాత 'కాలు' తనకుమారుని సంస్కృతము నేర్వ వ్రజనాథపండితుని సన్నిధికి పంపెను. ప్రప్రథమమున ఆకుఱ్ఱవానికి "ఓం"— అని వ్రాసిచూపి చదువుమనెను. నానకు ఆక్షేపించి "ఓం" అను శబ్దభావమును దెలుప ఆపండితుని అర్థించెను. "నీవా శబ్దభావము నిప్పుడే తెలిసికొనవలసిన యవసరము లేదు. నేను దానిని వివరింపఁజాలను"— అని ఆ పండితుఁడనెను. "గురూజీ! అర్థమెఱుఁగని చదువు వ్యర్థమే కదా! తాము వివరింపఁజాలనంటిరి. నేను నాయెఱిఁగినంతవఱకు వివరింతును"— అని చెప్పి, ఆ ప్రణవాక్షరమునుగూర్చి చక్కఁగ విస్తరించి వివరించెను. నానకు తెలివికి ఆపండితుఁడు ఇంతింతనరాని విస్మయమందెను.

'కాలు' తనకుమారుని మనస్సును ప్రాపంచిక విషయములవంకకు మరలింపఁ దనవలన అయినంత వఱకుఁ బ్రయత్నించెను. భూములవ్యవసాయమునకు సంబంధించిన కార్యములెల్ల అతని కప్పగించెను. కాని, వాని విషయమున నేమాత్రము శ్రద్ధవహింపక, గంటలకొలఁది పొలములలో ధ్యానసమాధిలోఁ గాలము గడుపఁదొడంగెను. అతఁడు మేయుటకై పసులఁ దోలుకొని పోవువాఁడు, కాని అతని చిత్తము అన్యథా లగ్నమై పసులపయి పరాకులేకుండెడిది. తమపొలము సరిహద్దులను దాటి ఆపశువులు పొరుగు వాని పొలములపైఁ బడుట నానకుతండ్రికిఁ దెలిసి, కుమారునిఁ దీవ్రముగ మందలించెను. అతని సోమరి తనమునకు— అలసభావమునకు, శ్రద్ధలేమికి నిందించెను. అప్పుడు జనకునితో, నానకు "తామన్నట్లు నేను సోమరిని కాను. నాసొంతపొలములను జాగ్రత్తగఁ జూచికొనుచుంటిని" అనెను. "ఏమీ, నీ సొంతపొలములా? అవి ఎక్కడనున్నవి?" అని తండ్రి యతనిఁ బ్రశ్నించెను. "పితృదేవా! నా శరీరమే (నా)పొలము. నామనస్సే దుక్కిసాగించు వ్యక్తి. ధర్మమార్గానుసరణమే వ్యవసాయము. వినమ్రభావమే జలాధారము. భగవచ్చింతయే నేనందు విత్తిన విత్తనము. సంతుష్టియనునదే చదును చేయు పాపటమను సాధనము. సర్వమానవసౌభ్రాతృత్వమే పొలము చుట్టుగల కంచె. అట్టిపొలమందుఁ గలుగు పంటయే మనల మోక్షమునకుఁ బాత్రులనుగ నొనరింపఁ గలదు. అటకు మనల వెంబడించువారొక్కరు నుండరు. ఈవిషయము గ్రహింపనేరక లోకమంతయు సంసారవ్యామోహమునకుఁ జిక్కి పరిభ్రమించుట సంతాపకరము. ఈవాస్తవికతను గుర్తించినవారు లోకమున మిక్కిలి యరుదు.

అంత 'కాలు' తనకుమారుఁడు కర్షకవృత్తికిఁ బనికిరాఁడని గ్రహించి, యొకచిల్లరంగడి పెట్టించి వ్యాపారమునకు దింపెను. నానకు వస్తువులను సాధువులను, బీదలకు ఉచితముగఁ బంచిపెట్ట నారంభించెను. ఇంటిలోను, దుకాణములోను దన్ను జూడ వచ్చు యాచకులకుఁ దనచేతికి వచ్చినంతఁ బిడికిటికి బట్టినంత పైకమును అరమరలేకుండ దానము చేయఁ జొచ్చెను. నానకు "నావర్తకస్థానము విశాలమయినది, కాలనియమములేనిది. సత్యముతోను ఆత్మనిగ్రహముతోను గూడినది. నాకు లాభకరమయిన లావాదేవి సాధువులతోను, మహాత్ములతోను మాత్రమే. వారి కెల్లప్పుడు సుస్వాగతము" అనెడువాఁడు.

పదునైదేండ్ల యీడు గల నానకునకు ఒకనాఁడతని తండ్రి ఇరువది రూప్యములిచ్చి, "నానక్, సంతకు

వెడలి, లాభదాయకమగు వస్తువేదియో చక్కగ విచారించి తెమ్ము" అని చెప్పి, అతనికి తోడుగ "బాల" అను తన సేవకునిగూడఁ బంపెను. నానక్కును ఆసేవకుఁడును, తాల్వండికి ఇరువది మయిళ్ల దూరమందున్న "చుహర్ఖానా"_ అను ఊరుచేరిరి. అచట ఫకీరులగుంపొకటి నానకునకుఁ దటస్థపడెను. "పరమపావనులు భగవద్భక్తులు అయిన యీఫకీర్లకు అన్నదానము చేయుట మహాపవిత్ర కార్యమగునుగదా, వీరికి విందుచేయుసందర్భము తటస్థించుట యెంతలాభదాయకమయినది"_ అని యూహించి, వెంటనే సంతర్పణమునకుఁ గావలసిన వస్తువులను విలిచితెచ్చి వారి కత్యంతతృప్తికరముగ విందుగావించెను. అంత నానకును, ఆసేవకుఁడును సాయంతనమగుసరికి ఇంటికిరాఁగనే యజమానితో "బాల"- అతని కొడుకుచేసిన కార్యమునెల్ల పూస గ్రుచ్చినట్లు నివేదించెను. కాలు తనకొడుకు చేసిన పనికిఁ జాలవ్యాకులపుంది కోపించి, యతని చెంపపయి తీవ్రముగఁ గొట్టెను.

నానకు నీడపట్టునఁ గూర్చుండి లాభకరమగు పనులు చేయఁదగఁడని అతనితండ్రి తలంచెను. కాన నానక్కుతో !_ "ప్రియకుమారా ! గుఱ్ఱపుస్వారి చేయుము. అదియే నీకుఁ దగినకార్యము"_ అని ఆనతిచ్చెను. నానక్కు అందులకు ఇట్లు జవాబిచ్చెను:_ "పూజ్యుఁడవగు జనకా ! దైవజ్ఞానమే నావ్యాపార వృత్తి. సత్కార్యములతో నిండిన ధనసంచయమే దానివలని లాభప్రాప్తి. అట్టి నైతికక్రియాకలాపమే నాకు భగవత్సామ్రాజ్యసిద్ధికి మూలము గాఁగలదు."

అంత 'కాలూచాంద్'- కుమారునిం గాంచి, "నీవు వాణిజ్యముగాని, తదితరకృషిగాని సలుపుట కిష్టము లేనిచో,- ప్రభుత్వ కార్యాలయములం దెటనేని ఉద్యోగము చేయుము"_ అని సలహాయిచ్చెను. దాని కతఁడు "ఇదివఱకే నేను దైవసేవకుఁడనై యాతని గొలుచుచున్నాడను. నాప్రభుసేవను మనస్ఫూర్తిగను, విశ్వాసపూర్వకమునుఁ జేయ సర్వవిధములఁ బ్రయత్నించుచున్నాఁడను. తిరుగులేని దీక్షతో అతని యాజ్ఞలను నెఱవేర్చుచున్నాఁడను. నిశ్చలభక్తితో సేవయొనర్చుచు భగవదనుగ్రహసంపాదనార్థము తీవ్రముగఁ బూనుకొంటిని. అట్టి పరిచర్యలో నాకు ఎడతెఱపిగాని, శ్రమగాని యినుమంతయు లేదు."_ తనపుత్రుని దృఢనిశ్చయమును విన్న చాంద్ మౌనముద్రవహించి అటనుండి వెడలిపోయెను.

---

(556-వ పేజీ తరువాయి)

ఈ సందర్భమున శ్రీ జే. వి. సోమయాజులు గారి అధ్యక్షతన శ్రీ పులిపాటి వెంకటేశ్వర్లును రు. 501 లు యిచ్చి ఘనంగా సన్మానించారు. తదితర నటులను సయితము పుష్పమాలలతో అలంకరించి సన్మానించారు.

◆ ◆ ◆

వీనస్ పిక్చర్స్‌వారు 'పెండ్లికానుక' రజతోత్సవ సందర్భమున మైలాపూరు ఉడ్‌లాండ్సు హోటలులో యీ నెల 6వ తేదీన సమావేశము ఏర్పాటుచేశారు. శ్రీ బి. నాగిరెడ్డిగారు అధ్యక్షత వహించారు. శ్రీ జెమినీగణేష్ నటీనటులకు, సాంకేతిక సిబ్బందికి ట్రోఫీలు పంచిపెట్టారు.

శ్రీ బి. యన్. రెడ్డి, శ్రీ వి. నాగయ్య, శ్రీ ఎ. నాగేశ్వరరావు మాట్లాడుతూ 'పెండ్లికానుక'ను ఉత్తమ చిత్రంగా రూపొందించినందుకు అభినందిస్తూ యీ చిత్రం మూలంగా శ్రీధర్ ప్రథమశ్రేణీ దర్శకుడయ్యాడన్నారు. చిత్రంయొక్క బాగోగులు ఏ ఒక్క వర్గంమీద ఆధారపడదనియు, ఉమ్మడి కృషి, చిత్తశుద్ధి, పరస్పర సహాయసహకారాలు మేలైన చిత్రాల నిర్మాణానికి తోడ్పడతవన్నారు.

శ్రీ జెమినీగణేష్ మాట్లాడుతూ ఉత్తమ చిత్ర నిర్మాతలు, దర్శకులు యితర భాషలలో చిత్రనిర్మాణమునకు పూనుకొంటున్న సందర్భమున మొదట తామే భాషాచిత్రాల నిర్మాణంలో పేరుగడించారో మరువకుండా స్వభాషలలో సయితం చిత్రాలు తీయాలని అన్నారు.

సమావేశం తర్వాత విందు ఏర్పాటుచేశారు. వర్షము జోరున కురుస్తున్నా అనేకమంది నటీనటులు, దర్శకులు, నిర్మాతలు మున్నగు చలనచిత్ర రంగమునకు సంబంధించినవారు వచ్చారు.

# నూతనాధ్యాయము

  

ఆమె పుట్టిన రోజునే - ఆ మరుక్షణం లోనే - మేనత్త కొడుకైన అరవిందునితో ఆమె వివాహం నిశ్చయమైంది. కుటుంబ ఆచార సాంప్రదాయాలను అనుసరించి, తనకు నచ్చినా నచ్చకపోయినా - అతడు తన మేనమామ కుమార్తెనే వివాహం చేసుకోవాలి. మేనమామకు స్త్రీ సంతానం లేనప్పుడు మాత్రమే పై సంబంధం గురించి ఆలోచించడానికి వీలుంటుంది. ఆచార సాంప్రదాయాలు అపురూపంగానే తోచవచ్చు. చిత్రవిచిత్రంగానే వుండవచ్చు. అతడికి అసహ్యం వేసింది. ఎక్కడో విదేశాలలో నున్న ఆమెకూడా అతడికి అసహ్యంగా తోచింది. అయినా అతడు చేయగలిగిందేమీ లేదు. ఆనాడే తన తల్లి మాట యిచ్చింది. తలిదండ్రుల మాటను నిలబెట్టకపోతే వారి ఆగ్రహావేశాలకు గురికావలసిందే!

తనకు కాబోయే భార్య - సుధ - జన్మించిన రెండుమాసాలికే భారతదేశం వదలి తలిదండ్రులతో ఎక్కడో దూరాన వున్న సింగపూరు వెళ్లిపోయింది. అక్కడే పెరిగి పెద్దదైంది. ఈనాడు ఆమె అందాల భరిణె. పైగా చదువు సంస్కారములు గలది. ఆమె ముఖం ఎలావుండేదో కూడా అతడికిప్పుడు గుర్తులేదు. ఈ నాడామె ఎలా వుందో ఊహించుకోలేదు. పద్దెనిమిది సంవత్సరాలక్రితం - తాను ఆరేళ్ల కుర్రాడు - రెండు మాసాల పసికందు - సుధ - ప్రపంచాన్నే మరచి ప్రశాంతంగా ఊయల్లో నిద్రపోతూంటే ఒక్కసారి తొంగి చూచాడు ఆ ముఖాన్ని, అంతే తరువాత ఆమె విషయమే మరచిపోయాడు. ఇప్పుడు ఆలోచించడం మొదలుపెట్టాడు. ఊహించుకుంటున్నాడు. పలువిధాల తన కళ్లముందు చిత్రించుకుంటున్నాడు. ఆమె మేనమామ ఫొటో ఒకటి పూనాలో తమ ఇంట్లోవుంది. ఆయనలాగే ఆమెకూడా అంత అందవికారంగానూ వుంటుందేమో! ఆమె అత్తయ్య పోలికలు ఆమెలో వున్నా రూపురేఖలు బాగానే వుండవచ్చు. ఈ తన జీవిత సమస్యను తనకు తెలియకుండానే యీ విధంగా పరిష్కరించి వేస్తే?

కాబోయే అత్తమామలు, వారి ఒక్కగాను ఒక్క కూతురు ఆనాడు సింగపూరు నుండి వస్తున్నారు. బొంబాయినుండి వారిని తీసుకురావడానికి బయల్దేరాడు. దక్కను క్వీను బొంబాయి చేరగానే ఎందుకో అతడి శరీరం ఒక్కసారి జలదరించింది. ఏదో వింతగా తోచింది. సుధ ఎలావుంటుందో!

అరవిందుడు మెకానికల్ ఇంజనీరు. బీహారులో పని చేస్తున్నాడు. ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం యిచ్చి పూనాకు రప్పించారు తలిదండ్రులు. ఎందుకో అర్థం కాలేదు. వెంటనే శెలవు తీసుకొని హడావిడిగా వచ్చాడు. తాము నిర్ణయించిన పిల్లనే వివాహమాడాలని తలిదండ్రులు చెప్పేసరికి అతడికి ఆశ్చర్యం వేసింది. ఆమెను తానెప్పుడూ చూడలేదే! రెండు మాసాల పసికందుగా వెళ్లి మళ్లీ యింతవరకూ భారతగడ్డపై ఆమె

అడుగుపెట్టలేదే! ఏమిటీ శాసనం? తలిదండ్రుల యీపనికి అతడికి అసహ్యం వేసింది. తన అయిష్టతను వారికి అసందిగ్ధంగా తెలిపాడు. అవసరమైతే ఇంట్లోంచి వెళ్ళిపోతానన్నాడు. కాని వృద్ధులైన తలిదండ్రులు బ్రతిమిలాడారు. ఆఖరికి కొంత సమాధానానికివచ్చి, పిల్లను చూచిన తరువాతనే తన తుది నిర్ణయం చెప్పడానికి అంగీకరించాడు.

ఆ నాడు రాజాగోయే వారిని తీసుక్కురావడానికి బొంబాయి వెళ్లిన అరవిందుడు వారిని చూడగానే తన కళ్లనుతానే నమ్మలేక పోయాడు. ఆమె తన ఊహాగానానికి ఎక్కడా అందలేదు. యౌవ్వనంతో మిలమిలలాడుతూ ప్రకృతిలోని సౌందర్యమంతా మూర్తీభవించిన సుందరమూర్తా అన్నట్లువుందిసుధ. చిరునవ్వులు చిందులాడే ఆ చిన్నారి ముఖము, ఆ వయ్యారములోని ఆమె వంపుసొంపులు అతణ్ణి అమాంతంగా బంధించివేశాయి. అంతేగాదు బాధ్యతాయుతమైన ఆమె నడవడి, ముచ్చటగొలిపే ఆమె ముద్దుపలుకులు అతణ్ణి ఆనందపరిచాయి. తలిదండ్రుల ప్రేమాభిమానాలలో పెరిగి పెద్దదై విద్యావంతురాలైన ప్రతి భారతవనితకు వుండే నమ్రత, అణకువ, బిడియము ఆమెలో కన్పించాయి. అతణ్ణి చూడాగానే - అతడే తన కు కాబోయే భర్తని ఆమె గ్రహించింది. ఆమె అంత స్వతంత్రత చూపక పోయినా చనువుగానే వ్యవహరించింది. పూనాకు వచ్చిన ఆ కొద్ది రోజుల్లోనే వారి వివాహం జరిగింది.

కూతురుని, అల్లుణ్ణి తమతోకూడా మలయాకు తీసుకు వెడదామనుకున్నారు సుధ తలి దండ్రులు. అక్కడ కౌలాలంపూరులో సుధతండ్రికి కాంట్రాక్టు సంస్థ వుంది. ఇంజనీరింగు, కట్టడాలు బాగా తెలిసిన అరవిందుడు తన వద్దవుంటే తన సంస్థ బాగా అభివృద్ధి చెందుతుందని అతడు ఆశించాడు. పైగా అతడికి కొడుకులు లేరు. ఒక్కగానుఒక్కకూతురు. ఆ పరిస్థితులలో అందరి తండ్రులలాగే అతడుకూడా తన కూతురును తనవద్దనే వుంచుకుందామని ఆశించాడు. అందుకు అరవిందుని తలతండ్రులు మొదట అంగీకరించక పోయినా ఆఖరికి అతి కష్టంమీద ఒప్పుకున్నారు.

మలయాలో అరవిందునిజీవితం శత సహస్రపుష్పాలుగా వికసించింది. తన వృత్తిలోసాటిలేని మేటిగా విజయాన్ని సాధించాడు. పేరు ప్రఖ్యాతులతో బాటు సిరిసంపదలుకూడా వృద్ధినొందాయి. జీవితాన్ని అతురాలా జీవించాడు. ఇంతలోనే మేనమామ చనిపోయాడు. అన్ని విధాల అభివృద్ధి చెందిన మామగారి ఇంజినీరంగు సంస్థ తన ఆస్థిగా మిగిలింది, తన ఒక్క కొడుకు గోవిందుని పెంచి పెద్దచేసిన అత్త గారు కూడ ఆతర్వాత కొద్దికాలానికే కన్నుమూసింది. ఇన్ని సంవత్సరాలలోను ఒక్కసారి మాత్రమే అరవిందుడు భార్య సమేతంగా ముసలి వారైన తలిదండ్రులను చూడ్డానికి భారత దేశంవచ్చాడు. అప్పుడే 1936లో రెండుమాసాల వ్యవధిలో తలిదండ్రులు చనిపోయారు. వారి అవసాన కాలంలో అతడు వారిప్రక్కనే వుండగలిగాడు.

1938 నుండి అరవిందుని దురదృష్ట దేవత ఆవహించింది. అత్తగారు కన్ను

మూసింది. నెలల తరబడి భార్యజబ్బుతో పడి ఎంత చికిత్సచేయించినా ఆఖరికి ఆమె అంతరించింది, ఇంతలో ప్రపంచయుద్ధం వచ్చింది. ఆ యుద్ధంతోబాటు అతడి వ్యాపారంకూడా అభివృద్ధి చెందింది. దేశాన్ని జపానువారు ఆక్రమించుకున్నారు. జపానువారి ఆక్రమణలోవుండగానే అతడి వ్యాపారం మందగించింది. అంతవరకు సంపాదించినదంతా నష్టపోయాడు. ఆఖరికి ఆ అల్లకల్లోలంలోబాంబుపడి అరవిందుడు మరణించాడు.

యుద్ధంముగిసింది. గోవిందుడు ఏకాకి. రోజు గడవడానికి కష్టమై అతడి జీవితం దుర్భరమైంది. తండ్రి మరణం తర్వాత మిగిలినదాన్ని కాస్త కూడబెట్టుకుని, నూతన జీవితం ప్రారంభించడానికై 1947 లో బయల్దేరి భారతదేశం వచ్చాశాడు. పూనాలోవున్న తాతగారి ఇల్లు తనకు మిగిలింది. అందువల్ల అక్కడే చిన్నతరహా ఇంజనీరింగు సంస్థను నెలకొల్పాడు. డబ్బు కోసం ఎంతో యిబ్బంది పడేవాడు. అయినా అతడు ధృఢసంకల్పమున్నవాడు. వయస్సు ఇరవై అయిదైనా యింకా వివాహంకాలేదు. ధైర్యంతో అన్నిఅడ్డంకలను అధిగమిస్తూ అతి కష్టంమీద తన వృత్తిని కొనసాగిస్తూవుండేవాడు.

ఒకనాడు అత్యవసరముగా అతడికి డబ్బుకావలసి వచ్చింది. అందువల్లనే అతడు బొంబాయికి ప్రయాణమైవెళ్లాడు. ఆ నాడు అతడికి రెండువేలరూపాయిలు కావాలి. శతవిధాల ప్రయత్నించాడు. కాని ఫలించలేదు. ఇక మిగిలిన దల్లా ఒక్కటే మార్గం – తన జీవితభీమా పట్టాపై అప్పు తీసుకోవాలి. అందుకే బొంబాయిలో వున్న భీమాకంపెనీ కేంద్ర కార్యాలయానికి బయల్దేరాడు. తొందరగా చేయవలసినవన్నీ ముగించి డబ్బు తీసుకుందామని ఆశించాడు.

తిన్నగా తనకు తెలిసిన ఉద్యోగిదగ్గరకు వెళ్ళి అప్పుదరఖాస్తు పూర్తిచేసి యిచ్చి తొందగా డబ్బువచ్చేలాచేయమనికోరాడు. అక్కడనుండి వెళ్ళిన కాగితాలకోసం నిరీక్షిస్తూ యిద్దరూ అతడి గత చరిత్ర గురించి మాట్లాడుకోవడం ప్రారంభించారు.

"నాన్నగారు బ్రతికివుంటే నాకీనాడు యీ బాధలు వుండేవికావు. కాని ... యీ భీకర యుద్ధం చేస్తూన్నవ్యాపారాన్ని పడగొట్టడమేగాక, ఆఖరికి ఆయన్ను కూడ పొట్ట పెట్టుకుంది." అన్నాడు గోవిందుడు నిస్పృహతో.

"ఆయన చనిపోయేసరికి డబ్బేమీ మిగల్చలేదూ ?" అన్నాడా ఉద్యోగి.

"మిగిల్చినా అది అంత లెక్కలోది కాదూ. ఉన్నదేదో తీసుకొని నేను వచ్చేను. దానితో జీవితం గడపడం దుర్లభం"

"మీ నాన్నగారు జీవితాన్ని భీమా చెయ్యలేదూ ?"

"అదే దురదృష్టకరమైనది. జీవిత భీమా అంటే ఆయనకు నమ్మకంలేదు. అయినా జపాను వారి ఆక్రమణకు కొద్ది మాసాలకు ముందు స్నేహితుడైన ఒక ఏజెంటును తృప్తి పరచడానికి ఒక పట్టా తీసుకున్నాడు, మొదటి సంవత్సరం ప్రీమియం కట్టి తరువాత యిక తదుపరి ప్రీమి

యములు కట్టడానికి వీలుకలుగలేదు. నిజం చెప్పాలంటే ఆ కంపెనీనే మూసివేశారు. అందువల్ల పట్టా మురిగిపోయింది.''

''ఆక్రమణ తర్వాతే అతడు మరణించాడన్నావుకదూ?''

''అవును జపాను వారు ఆక్రమించిన రెండు సంవత్సరాల తరువాత. నా వద్ద యింట్లో అందుకు సంబంధించిన కాగితాలు అన్నీవున్నాయి. అయినా లాభమేమిటి? చేయడానికేమీలేదు. ఆ అధ్యాయం ముగిసింది.''

''ఏ కంపెనీ?''

''మీకంపెనీయే''అన్నాడు గోవిందుడు నిరాశగా ఎదుటివాని ముఖంలోకిచూస్తూ.

''చూడు గోవింద్ ఒక్క నిమిషం ఆగు. ఈ విషయంలో ఎక్కడో ఏదో పొరపాటు జరిగివుండాలి. అయినా చూచి చెప్తాను వుండు.'' అంటూ ఆ ఉద్యోగి అందుకు సంబంధించిన కాగితాలకోసం కబురు పంపాడు. అదిరాగానే అన్నిటిని పరీక్షగా చూచి గోవిందునివైపు ఒక్క చిరు నవ్వు విసిరాడు.

''చూడు గోవింద్ ఈ పట్టాకు విలువ లేదనడం పొరపాటు. విదేశాలలో ఆక్రమిత ప్రాంతాలలో వున్న పట్టాదారులకు ప్రీమియములు కట్టుటలో కొన్ని మినహాయింపులు, ప్రయోజనాలు కల్పించబడ్డాయి. ఈ నిబంధనల ప్రకారం భీమా చేయబడిన మొత్తంలోనుండి మీనాన్న ఇంకా పుంటే చెల్లించవలసిన ప్రీమియం మొత్తాన్ని తగ్గించి మిగతను మీరుపొందవచ్చును. అందుకు కావలసిన కాగితాలన్నీ పూర్తి చేయి. ఆయన మరణించినట్లుగా సర్టిఫికేటు, నీవే ఆయనకు ఏకైక వారసుడవని రుజువు – చూపిస్తే యీడబ్బు నీకు యివ్వడం జరుగుతుంది.'' అన్నాడాయన నవ్వుతూ.

గోవిందుకు నిజంగా ఆశ్చర్యవేసింది. వెంటనే పూనా వెళ్ళి అందుకు సంబంధించిన పత్రాలన్నీ తీసుకువచ్చి అన్ని విషయాలు రుజువుచేశాడు. ఏమీ విలవలేదనుకున్న పట్టా మీదే అతడికి కావలసిన డబ్బు చేతికి అందింది.

# స్వీకారం

"రాఘవ"

ఆ నాడు శ్రావణ శుక్రవారం. పౌర్ణమి. సావిత్రి ఒంటరిగా మేడమీద పిట్టగోడపై కూర్చొని, చుట్టూ గ్రుడ్డివెన్నెల్లో తడిసి పోతూవున్న ప్రకృతిని అవలోకిస్తోంది. మేడక్రింద సీతాపతి, తల్లికాంతమ్మ యేవో విషయాన్ని మాట్లాడుకొంటూవున్నారు. సావిత్రి తల్లి పార్వతి ఆ నాడు పేరంటానికి వెళ్లి యింకా తిరిగిరాలేదు. పార్వతిని పిల్చిన అమ్మలక్కలంతా సావిత్రిని కూడా పేరంటానికి తీసుకొని రానందుకు యెన్నో ప్రశ్నలువేసి విసిగెత్తించారు. పార్వతి యేవేవో సమాధానాలు యిచ్చి తప్పుకొంది. అయినా హృదయంలో -'సావిత్రినికూడా పేరంటానికి తీసుకొస్తే యెంత బాగుండేది'-అని పరితప్తపడింది. సావిత్రికి యిదంతా యేమీ పట్టించుకోదల్చుకోవాలనిపించలేదు. ఒక వేళ తల్లి తిరిగివచ్చి 'నలుగురూ యిలా అన్నారు'- అని బాధగా చెప్పినా వినిపించుకోవాలనిపించలేదు. అక్కడికీ పేరంటాళ్లు పిల్చి వెళ్ళగానే, పార్వతి ముస్తాబు అవుతూ, సావిత్రిని మరీమరీ రమ్మనమనీ, రాకపోతే బాగుండదనీ, నలుగురూ నన్నేదో విధంగా అడుగుతారనీ, వాటికి జవాబులిచ్చుకోలేక అబద్ధాలు చెప్పాల్సొస్తుందనీ, బయలుదేరి, వీధిగుమ్మందాటుతూన్నంతవరకూ సణుగుతూ అంటూనేవుంది. సావిత్రి మౌనంతో, తనకేమీ పట్టనట్టుండిపోయింది. తిరస్కారభావాన్ని స్ఫురింపచేయటం - విసుక్కోవటం - మొదలైనవి చేసింది. పార్వతికీస్థితియేమీ అర్థంకాలేదు. ఏంచేయాలో తోచలేదు. బలవంతంగా రెక్క పుచ్చుకొని లాక్కొని పోదామంటే సావిత్రి యేమీ చిన్నపిల్లగాదు. పద్దెనిమిది సంవత్సరాలున్న గారాబు పట్టి. శ్రావణశుక్రవారం - వరలక్ష్మీవ్రతం - అమ్మలక్కలంతా సంతోషంగానూ - భక్తితోనూ నోచుకుంటారే! అమ్మవారిని చూసిరావాలే! అని కూడా తెలియదా! అని అనుకొంటే, సావిత్రికి బాగా తెలుసు. స్త్రీలపాలిట వరలక్ష్మీవ్రతం యెంత ప్రాముఖ్యమైందో సావిత్రికి తెలియకపోలేదు. స్కూల్ ఫైనల్ వరకూ చదువుకొన్న సావిత్రికి చాలా బాగా తెలుసు. ఎంత బ్రతిమిలాడినా సావిత్రి రాకపోయేసరికి, పార్వతి పెళ్లీడుకొచ్చిన దాన్ని యేమీ అనలేక - "ఇదంతా నాకర్మ" అని మనస్సులోనే అనుకొని పేరంటానికి వెళ్లిపోయింది.

రెండు రోజుల్నుంచి సీతాపతి - కాంతమ్మ తీరుబడిగా కూర్చొని ప్రస్తావించే విషయం యేమిటో - అసలా సమాలోచనా సారాంశం యేమిటోసావిత్రికి యీ నాటివరకూ, యీ వేళవరకూ అవగతంకాలేదు. మొత్తానికది 'తన పెళ్లి విషయమే'నని మాత్రం యించుక గ్రహించగల్గింది. ఎంతవరకైతే తానావిషయాన్ని స్ఫుటంగా విని, మనస్ఫూర్తిగా అర్థంచేసుకొందో, దాన్ని మాత్రం తీరిక దొరికినప్పుడల్లా యేకాంతంగా కూర్చొని యెడతెగని ఆలోచనలతో నెమరువేసుకోసాగింది. ప్రయోజనం తృప్తిగా యేవిధంగానూ అంతరాత్మకు లభించటంలేదు.-"అమ్మకైనా యీ విషయం తెలియకుండా వుంటుందా ?" అనీ తనలో తాను ఒక్కొక్కసారి ప్రశ్నించుకొనేది. దానివల్ల ఒకవేళకల్గేలాభం యేమిటి? అయినా పార్వతిని అడిగి తెలుసుకుందామనుకొంది వచ్చీరాంగానే.

సహజంగానే సావిత్రికి యే సందేహం కల్గినా, యే అనుమానం వచ్చినా పార్వతి నడిగి తెలుసుకొని సంతృప్తి పడుతూవుంటుంది. కన్న తల్లి తన కష్టం తెలుసుకొని తీర్చకపోతే, మరెవ్వరీలోకంలో తీర్చగలరనే విశ్వాసం సావిత్రికి నిలువెల్లావుంది. అందువల్ల, తన పెళ్ళిగురించి, ఏర్పడిన ఆలోచనాత్మకమైన ప్రశ్నలను తల్లికి ఎరుకపరిస్తే తీరిపోతయి - తనజీవితం సుఖపూరిత మవుతుందని సావిత్రి ఆశించింది, సూటిగా తల్లికెలా తెలియపర్చాలో తొలిగా సావిత్రికి అర్థంకాలేదు. కానేపు యింకా అదేవిధంగా ఆలోచించి - ఒక్కింత తెప్పరిల్లి - తన చదువూ - సంస్కారం - భావప్రకటన మొదలైనవాటిని గుర్తుకి తెచ్చుకొంది. హృదయాన్ని

ధైర్యంలో నింపుకొంది. తండ్రీ – నాయనమ్మా చేసే ప్రయత్నాలకూ – రహస్యసమాలోచలకూ – గుసగుసలకూ – తర్జన భర్జనలకూ – సందివ్వకుండా తన జీవితం పరాయి వాడికి అంకితం కాకుండా చేసుకోవాలనిపించింది. ఎలాగైనా సరే తన హృద్భావాన్ని యీ రాత్రే, తల్లికి ఎరుకపర్చాలని నిశ్చయించుకొంది. చుట్టూచూచింది. ఆకాశం మేఘావృతంకాబోతోంది. మసక వెన్నెల క్రమేపీ చిక్కబడుతూవుంది. యీపాటికి 'అమ్మ వచ్చేసేవుంటుంది' – అని భావించి చటుక్కున పిట్టగోడమీదనుంచి లేచి, గబగబ మెట్లుదిగి క్రిందకు వచ్చేసింది,

ఇంకా అప్పటికి పార్వతి పేరంటంనుంచి తిరిగి రాలేదు 'భోజనాలవేళయినా పార్వతియింకాతిరిగి రాలేదేమా'! అని కాంతమ్మ ఫుక్కురోషంతో నసుగుతోంది. సీతాపతిమాత్రం వసారాలో ఒంటరిగా కూర్చొని – యేమిటో దీర్ఘాలోచన చేస్తున్న సావిత్రివంక చూస్తూ – "మాఘమాసంలో యెలాగైనాసరే నీ పెళ్లిచేయక తప్పదమ్మా!" – అని మనసులో స్థిమితంగా అనుకున్నాడు. మధ్యమధ్య సావిత్రి, తండ్రివంకచూస్తూ తన తీవ్రాలోచల్నికొనసాగిస్తూండగా, సీతాపతి ముఖంలో కళలికలు క్రొత్తగా కనిపించసాగినాయి. సావిత్రి వాటిభావాన్ని కొంతవరకు అర్థంచేసుకొనటానికి ప్రయత్నించ సాగింది.

"నాన్నా – నాయనమ్మా తనకి పరాయివాణ్ణిచ్చి చేస్తారేమో" – అని సావిత్రి ఒక విధంగా బాధపడసాగింది. వాస్తవంగా యీ బాధ సావిత్రిలో యింత త్వరితంగా కల్గడానికి, సీతాపతి - కాంతమ్మ లోగడనుంచి జరుపుకొస్తున్న రహస్యసమాలోచనల సారాంశమే ముమ్మాటికి కారణం.

ఇంతగా సావిత్రి బాధపడుతున్నా, ఒకమొండి ధైర్యం ఎందుకో ఒకమూల, హృదయంలో దాక్కొని వుండి - "నీకలా అన్యాయంచేయరులే నాన్న – నాయనమ్మానూ!" అని ఓదార్చ సాగింది. సావిత్రికి యెంత ఆలోచించుకొన్నా "సుఖపడగలననే" భావం తప్పమరేదీ అడ్డు తగిలి విసిగించటంలేదు. కన్నవారెప్పుడూ తనగొంతుక కోస్తారని ఆశించలేదు. తన జీవితం కలకాలమూ సుఖప్రదంకావాలని విశ్వసిస్తూ తల్లికోసం ఎదురు చూడ సాగింది.

ఇంతలో గోడగడియారం ఎనిమిదిగంటలు కొట్టింది. పార్వతి యింకారాలేదు. సీతాపతి మాత్రం భోజనానికి లేచి వెళ్ళిపోయాడు. సావిత్రి అలాగేకూర్చొని – "యింకారాలేదేమిటీ?" అని తనలో తాను ప్రశ్నించుకొంటూ, వీధివైపు ఆత్రుత నయనాల్తో చూస్తూవుంది.

పార్వతి రాలేదు.

"ఇంత సేపా! పేరంటానికిపోతే! ఇక ఎక్కడికి పోతే అక్కడేనా! యిట్టా యిల్లూవాకిలీవున్నయ్యనే జ్ఞాపకం వుందా అని! ఇలాంటి వాళ్ళని యింతవరకెప్పుడూ చూడలేదు. అత్తగారుంది గదా! ఆ మాత్రం కొడుక్కి అన్నంపెట్టుకోలేదూ, అనేగా! అందరి కోడళ్లూ అత్తగారిపట్ల యిలాగే వున్నారా! బొత్తిగా యింటి విషయాల్ని పట్టించుకోదు. యిక యీ సంసారం యెలాబాగుపడుతుందోగానీ, భగవంతుడా! నాకేం అర్థంకావటం లేదు." – అని ఏకధాటిగా కాంతమ్మ వంటింట్లో సీతాపతికి వడ్డనచేస్తూ, పార్వతిని దూయబట్ట సాగింది. యిప్పటికి కాంతమ్మ పార్వతి పేరంటానికి వెళ్ళినందుకు, మూడుసార్లు మూతి విరుపులతోనూ – రుసరుసలతోనూ దుమ్మెత్తిపోయటం పూర్తిచేసింది.

వసారాలో స్తబ్ధుగా కూర్చున్న సావిత్రిగుండె, నాయనమ్మ ఎత్తిపొడుపు మాటలకి తరుక్కుపోయింది – 'ఎన్నడూ గుమ్మందాటి పోని, అమ్మను యీవిధంగా శ్రావణశుక్రవారం పూట చివాట్లుపెడుతోందని,' చెప్పరానంతకోపం ముంచుకొచ్చింది. తనింకా బ్రతికివుండగా, కన్నతల్లిని, నాయనమ్మ ఆ విధంగా దెప్పిపొడవటం సావిత్రి చూస్తూ చూస్తూ సహించలేకపోయింది. 'అమ్మను అనవుసరంగా ఆడిపోసుకొంటోందని' సావిత్రికి పట్టరానంతకోపం తరుముకొచ్చింది. అమ్మ తరఫున వకల్తా పుచ్చుకొని, నాయనమ్మతో మాటకిమాట అందామని ప్రయత్నించింది. కాని రసాభాస అవుతుందని జంకింది. 'నాయనమ్మకూడా ఒకప్పుడు యీ యింటికి కోడలేగా! అదృష్టంతోసుకొని రాబట్టి మా నాన్నని కన్నది. మా అమ్మను కోడలిగా చేసుకొంది. యింత మాత్రానికే తాను గొప్ప హోదాలో వున్నట్లు చెలామణికావాలా? ఏమిటీమిడిసిపాటు? అమ్మను అనవుసరంగా మాటలనటం దేనికి? పేరం

టానికి వెళ్లిన అమ్మ తిరిగిరాకుండా వుంటుందా ?'_ అని తనలో తాను సంబాళించుకొంటూండగా ఎనిమిదన్నరైంది.

ఇంతలో వీధిలో తలుపు చప్పుడైంది. చిటపట చినుకులు పడుతున్నాయి. సావిత్రి తేరిపారచూసి_ "అమ్మా!" అని పిల్చింది. పార్వతి — 'ఆఁ... నేనే' అంటూ శ్రావణలక్ష్మి లాగా వసారాలోనికి వచ్చి, శనగల మూట చేతిలోపెట్టి — "నువ్వు రాలేదని ప్రతివారూ అడగటమే! చెప్పలేక విసుగెత్తిందనుకో" అన్నది. ఆ సమయానికి సీతాపతి కూడా మూతి తుడుచుకుంటూ వసారాలోకి వచ్చి, జారుడు కుర్చీలో చతికిలపడ్డాడు. తల్లి అన్నమాటకి, సావిత్రి బదులు యేమీ చెప్పలేదు. కాంతమ్మ మాత్రం వూరుకోక, వున్న అక్కసునంతా వెళ్ళగ్రక్కుతూ -

"నువ్వు వెళ్లిందిచాలక, దాన్నికూడా వూరంతా తిప్పుదామనుకున్నావా? పెళ్ళీడుకొచ్చినదాన్ని ఎలా వెంట తీసుకొని పోదామనుకొన్నావ్? ఆ మాత్రం యింకా తెలియదుటే" అంది.

"శ్రావణ శుక్రవారం పూట, అమ్మ వార్ని చూడటంకూడా తప్పేనా?" - అని తనలో తాను ప్రశ్నించుకొంది పార్వతి. అక్కణ్ణుంచి కాంతమ్మ మరికొంత సేపటివరకూ చిర్రుబుర్రులాడుతూనే వ్యాఖ్యానించింది. తన కాలపు రోజుల్ని - యీ కాలపు రోజుల్ని ఎడాపెడా విమర్శించి, పార్వతిని చిన్నబుచ్చింది. సావిత్రి యిక వుండబట్టలేక —

"అనవసరంగా అమ్మమీద ఎందుకలా నోరు చేసుకుంటావ్ బామ్మా! ఏంపాపం చేసిందని వూరికే శ్రావణ శుక్రవారం పూట చివాట్లు పెడతావ్! యిందాకన్నుంచి వింటూవున్నా, పోనీలే! వూరుకుంటావ్‌గదా అని చూస్తూంటే, మరీ విపరీతం అయిపోతోంది. ఒకవైపు నాన్న వున్నప్పుడు కూడా నువ్విలా మాట్లాడటం న్యాయంగాదు. నేనుండగా యికనుంచి అమ్మను యేమన్నా సరే వూరుకోను" అని గంభీరంగా కాంతమ్మ కెదురు తిరిగి నిలబడి, ఆవిడగారి గొంతుకన్నా — కాస్త హెచ్చించి అరిచింది.

కాంతమ్మ నిలువునా స్తంభించిపోయింది. సావిత్రి యీవిధంగా తల్లి తరపున నిలబడి అకస్మాత్తుగా జవాబిస్తుందని కల గనలేదు. ఇలా అంటుందని వూహించలేదు. ఒక్కసారిగా తెల్లబోయింది. పార్వతి నిర్విణ్ణురాలైంది. సీతాపతి అదిరిపడి లేచి సావిత్రి వంక నివ్వెఱపోతూ చూసాడు. తేలుకుట్టిన దొంగ లాగా కాంతమ్మ నెమ్మదిగా వెనక్కి తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయింది. ఆరాత్రి కాంతమ్మ అన్నం తినటం పూర్తయినాకే, పార్వతి - సావిత్రి తిన్నారు.

ఇంతటి విపరీత పరిణామం సావిత్రిలో యెందుకు కల్గిందో, సీతాపతికి తెలియలేదు. పార్వతికీ పాలుపోలేదు — కాంతమ్మకీ అర్థంకాలేదు. ఎవరికి వారే ఆలోచించుకొంటూ ఆ రాత్రి గడిపారు.

## 2

శ్రావణ శుక్రవారం - పౌర్ణమి నాడు జరిగిన సంఘటనానంతరం రెండుమూడు వారాలు గడిచినా యిల్లంతా నిశ్శబ్దంగానే వుండిపోయినది. కాంతమ్మ దృష్టిలో పార్వతి — సావిత్రి ఒకటై, తనమీద కత్తి కట్టి, యిల్లంతటికీ ఏకఛత్రాధిపత్యం వహించి, తన్నొంటరిదాన్ని చేసి . ఏడిపించాలనుకొంటున్నారని అపోహపడింది. ముసిలిదాన్ని గదా! అని చులకన భావం ప్రకటిస్తూ, తనచేత యింటెడు చాకిరీ చేయించాలని కుతంత్రాలు పన్నుతున్నారని దురభిప్రాయపడింది.

తల్లిని వెనకేసుకొచ్చి సావిత్రి ఆనాడు అలా, కోడలుకుముందు తన్ను చిన్నపుచ్చుతూందని కాంతమ్మ కలగానైనా తల్చలేదు. ఆనాడు సావిత్రి అన్న మాటలు మాటిమాటికీ కాంతమ్మ చెవుల్లో యీ నాటివరకూ గింగురుమంటూనే వున్నాయి. ఒక్కొక్కసారి ఆ మాటల్ని తల్చుకొంటే, జడుపు కల్గుతున్నట్లుండేది. కంగారు పుట్టేది. చివరకు అదే యావత్తో శరీరమంతా చెమటపట్టి, కంపరమెత్తినట్లుండేది. విశ్రాంతిగా కూర్చున్నప్పుడల్లా సావిత్రి గుర్తుకొచ్చేది. తన వయస్సు ఎంత? సావిత్రి యీడెంత? అని తనలో తాను వింతగా తల్చుకొని వులిక్కిపడుతూండేది. తన కళ్ళముందు పుట్టిన బొప్పికాయలు కూడా తన్నిలా భయపెట్టటం ఎంత చోద్యంగా వుంది! అని ముక్కుమీద వ్రేలుంచుకునేది.

సావిత్రికి కాంతమ్మమీద వ్యక్తిగతంగా యే దురభిప్రాయమూ లేదు. నాయనమ్మమీద ఆనాడు వచ్చిన కోపం ఆనాడే సమసిపోయింది. పార్వతికి మాత్రం, సావిత్రి స్థితి యింతవరకూ బోధపడలేదు. కాని, యింట్లో ఒక్కసారిగా యింతటిమార్పు వచ్చే

సరికి కాంతమ్మ, సీతాపతి ఒకవైపైనట్లు — పార్వతి, సావిత్రి మరొకవైపైనట్లు పరస్పరంగా భావించుకున్నారు. ఎడమొగాలు - పెడమొగాలైనవి. ఎవరి పనులు వాళ్లే చేసుకొంటున్నామని అంతర్యంలో అనుకోవటం వరకూ జరిగినా, ఫలితం మాత్రం ఒకరి నుండి మరొకరు పొందుతూనే వున్నారు! చిత్రమేమిటో మరి. కాంతమ్మ మాత్రం — "ఇదివరకులాగా నేను యింటెడు చాకిరీ చేయడానికి ఓపిక లేదు. ఆ వేళకి ముడిగట్టుకొని, ఆ నాల్గు మెతుకులూ వండిపడేస్తాను. యిష్టం వున్నవాళ్లు తినండి. లేనివాళ్లు మానుకోండి. నే చేయలేను నాయనా! యీ గంపెడు చాకిరీనూ" అని నిత్యమూ అనుకునేది. తీరా చూస్తే యింటెడు పనీ ఆమెగారే స్వహస్తాలతో చేస్తూ వుండేది. పార్వతిలోగానీ, సావిత్రిలోగానీ, కాంతమ్మకున్న వుద్దేశ్యంలాంటిది యిసుమంతయినా వుండేదిగాదు.

పార్వతి కాపురానికి వచ్చిన లగాయితూ — "తాను యీ యింటికి కోడల్ని గదా! నా పని నేను చేసుకున్నానని చేతులు దులుపుకోవటం భావ్యంగాదు. అలా చేయటమే సంభవిస్తే, నా సంసారాన్ని నేను చేతులారా చక్కదిద్దుకోలేక, నాశనం చేసుకొన్నదాన్నవుతాను. అందుకని యింటిల్లిపాదీ సుఖం కోసం, సంఘంలో పేరుప్రతిష్ఠలకోసం, తానెంత కష్టపడితే తనంత బాగుపడినట్లేనని" మనస్ఫూర్తిగా అనుకుంది. దీన్ని ఆధారంగా చేసుకొనే కోడలి పదవిని నిర్వహిస్తూ, సంసారబాధ్యతను స్వీకరించింది.

అత్తగారుఆనాడన్న మాటలవల్ల పార్వతిలో యేమార్పు కల్గలేదు. కాని, కాంతమ్మ దృష్టిలో పార్వతి, సావిత్రి వుద్బోధవల్ల పూర్తిగా మారిపోయిందనే దృఢనమ్మకం, గట్టి అభిప్రాయం. ఆ నాటినుంచీ కూడా సీతాపతి మాత్రం ఎవరిపట్లా — యే సానుభూతి - సందేశమూ చూపకుండా - యివ్వకుండా, తటస్థంగా వుండిపోయాడు. తనకేమీ పట్టనట్లుగా తిరుగసాగాడు. అలా వుండుటమే కొంతవరకు మంచిదేమోననిపించింది అతనికి..

అలా వుండటం కూడా ఒక్కొక్కసారి మానవుడికి సాధ్యపడకపోవచ్చు. కాని, సీతాపతి దృష్టిలోనూ- అత్మలోకూడా తల్లి యెంత పూజ్యురాలో, భార్య కూడా అంతే విశ్వాసవంతురాలు — నమ్మకస్తురాలు. మిగిలింది కూతురు. లేక లేక పుట్టింది. అల్లాగుముద్దుగా పెరిగింది. పెళ్ళీడుకొచ్చింది. మాటా—మంచీ—మన్ననలు తెలుసు. సలక్షణంగా ఒకయింటి కోడలై తన సంసారాన్ని తాను నిర్విఘ్నంగా చేసుకోగల్గితే చాకచక్యం తెలిసినదైంది. అలాంటప్పుడు సీతాపతి యెవర్ని, యేమని మందలించగలడు? ఎవరిది తప్పో సీతాపతికి తెలియకగాదు. అసలది తప్పో — ఒప్పో సీతాపతికి తెలియకనూ పోలేదు. ఒకవేళ తాను పక్షపాత దృష్టితో ఎవర్ని ఏమన్నా, లోకం రకరకాలైన వాదనలతో దుమ్మెత్తిపోసేలాగు విమర్శించుతుంది. అప్పుడు సీతాపతి యేమని నిజం చెప్పగలడు? చెప్పినా ఎవరూ వినరు. నమ్మరు. నలుగురూ హీనంగా ఎంచుతారు. చులకనగాచేసి మాట్లాడుతారు. యీ అగచాట్లన్నింటిని అనుభవించటానికి మనస్కరించకనే, ఆనాడు సీతాపతి మూభావంగానూ — తటస్థంగానూ వుండిపోయాడు.

కాంతమ్మకు మాత్రం సీతాపతి అలా చూస్తూ వూరుకోవటం నచ్చలేదు. ఆనాడే, యేదోవిధంగా సావిత్రిని మందలించివుంటే ఎంతో బాగుండేదని అనుకొంది. కాని, అలా అప్పుడూ జరుగలేదు — యింతవరకూ జరుగలేదు. పోనీలే అని విరక్తి భావాన్ని ప్రకటించింది.

ఇలాంటి స్థితిలో ఒకనాడు కాంతమ్మను చూసి పోదామని వచ్చిన ప్రక్కయింటామె సావిత్రి పెళ్లిని గురించి ప్రశ్నించింది. కాంతమ్మ తృప్తిగా యే సమాధానం యివ్వకుండా మిగతా సంగతుల్ని ప్రస్తావించి పంపించివేసింది.

ఆనాటి రాత్రి సీతాపతి, భోజనానంతరం వాలుకుర్చీలో జారగిల పడుకొనివుండగా, కాంతమ్మ నెమ్మదిగావచ్చి యెదురుగా కూర్చొని, సావిత్రి పెళ్లి విషయాన్ని కదిపింది. సీతాపతి, తల ప్రక్కకి తిప్పి సావిత్రిని చూసాడు.

మండువా యింట్లో పార్వతి - సావిత్రి యెదురెదురుగా కూర్చొని కాంతమ్మ కబుర్లు వింటానికి సిద్ధంగా వున్నారు. కాంతమ్మ తన అనుభవాన్నంతటినీ వ్యక్తపరుస్తూ, పరాయి సంబంధానికీ, అయిన సంబంధానికీ గల తేడాల్ని, మంచీ-చెడునీ-మాటా-మర్యాదనీ విపులీకరిస్తూ దాదాపు ఒక అరగంటసేపు సీతాపతిని 'ఊ' కొట్టేటట్టు చేసింది. యీ అరగంటలోనూ సావిత్రికి ప్రతి అరనిముషానికీ అరికాలి మంట నెత్తికెక్కుతూనే వుంది. కాని, ఏం చేయగలదు? నాయనమ్మ, సయాన తండ్రికి తల్లి. పొంగిన కోపం లోలోపలనే వుంచుకొంది.

(సశేషము)

(534 వ-పేజీ తరువాయి)

ఆయన గొల్లుమని నవ్వుతూ "కూలి నాలి చేసే ఇక్కడివాళ్ళకి ఈ ప్రకృతి గొడవంతా ఎందుకు వచ్చింది చెప్పండి? వాళ్ళకి కావలసింది పనిపాటల నుంచి వచ్చాక పడుకోటానికి మంచం. ఒక్క నిమిషం కూర్చుని వాళ్ళ లెఖ్ఖపక్కలని వ్రాసుకోటానికి బల్లా, కుర్చీ... అలాంటి వసతులు ఇక్కడ వున్నాయి..." అని గుక్కతిప్పుకోకుండా ఏదో చెప్పబోతున్నాడు.

చటుక్కున ఆయన మాటలకు అడ్డువస్తూ "నాకు కావలసింది ఇలాంటి గదే! ఇంతకూ ఎంత అద్దె పుచ్చుకుంటారు?" అని ప్రశ్నించాను.

"వారానికి ఏడు మార్కులు (సుమారు మన లెక్క ననుసరించి ఏడున్నర రూపాయలు). ప్రతి ఆదివారం పక్కచుట్టలని మార్చే బాధ్యత మాదే..." అని సాధికారంగా జవాబిచ్చాడు.

"అలాగే. భోజనంకూడా ఇక్కడే చేయాలని నా కోరిక. రెండు మూడు వారాలు వుంటాను. వ్రాతపని బోలెడంత వుంది. ఆ పని చూసుకోటానికి మా ఇంట్లో తగిన వాతావరణం కనబడటంలేదు. అంచేత దాన్నంతా ఇక్కడే ప్రశాంతంగా చేసుకోవాలని నా ఆశ. నా పని ఏమో అంతే! ఇతర వాట్లో జోక్యం పుచ్చుకోటం నా తత్వంకాదు" అని వుద్రేకంతో కుతూహలంతో అన్నాను.

"మా భోజనాలు మీవంటి పెద్దమనుషులకి ససేమిరా నచ్చవు. మంచి హోటలు దగ్గర్లోనేవుంది. అక్కడి భోజనం కావాలంటే నేనే స్వయంగా తెచ్చి ఇస్తాను" అని నమ్రతగా అన్నాడు.

"ఊ! అలాగే చేయవచ్చు. ఈ గది నాకు బాగా నచ్చింది. ఇవ్వాళ ఇక్కడే వుండిపోతాను. నా సామాను గట్రా రేపు ప్రొద్దున్నే వస్తుంది. ఈ రాత్రికి భోజనం అక్కడినుంచే తెప్పిస్తే ఎంతో కృతజ్ఞుణ్ని" అని గంభీరస్వరంతో అంటూ బల్లదగ్గరనున్న కుర్చీమీద కూర్చున్నాను.

"సరేనండీ. కొంత అడ్వాన్సు ఇయ్యాలి" అని ఇదిగా చూస్తూ "మేం బీదవాళ్ళం. మీవంటి పెద్దమనుషులని అలా అడగాలసి వచ్చినందుకు క్షమించాలి..." అని ఏమో చెప్పబోతున్నాడు.

నేనే అడ్డువస్తూ "దాహం అవుతుంది. గ్లాసులో మంచినీళ్లు తెచ్చి ఇస్తిరా..." అని ఆవేదనతో అన్నాను.

మారుమాట చెప్పకుండా క్రిందికి గబగబ వెళ్ళిపోయాడు. కొంచెం సేపయ్యాక కూజానిండా మంచినీళ్లు రెండు గ్లాసులు, తువాలు, సబ్బుపెట్టె వగైరాలు తెచ్చి అవి వుండాలసిన స్థలాల్లో చక్కగా వుంచాడు.

"ఇంతకూ మీ పేరేమిటి?" అని ఆయన్ని ప్రశ్నించాను.

"లోబెడాన్స్... వింటానికి తమాషాగా వుంది కదండీ!" అని సణుక్కుంటూ అన్నాడు.

"ఏ పేరు ఎలావున్నా దాన్ని అంత పట్టించుకోటం నాకేమాత్రం ఇష్టంలేదు" అని దర్జాతో అంటూ "మీకు అభ్యంతరంలేకుంటే మనం ఇద్దరం దాహం పుచ్చుకుందాం" అని అంటూ ఒక గ్లాసుని పానీయాల గ్లాసుకిమల్లె చక్కగా నీళ్ళతో నింపి ఆయన చేతికిచ్చాను. కూజానే అమాంతంగా చేతికి పుచ్చుకుంటూ "బుడ్లనే ఆ పళాన ఖాళీచేసేవాళ్ళకి ఇలాంటి కూజానీళ్లు ఒక లెక్కా జమా మరి!" అని పకపకనవ్వుతూ నీళ్ళని త్రాగటానికి మొదలెట్టాను.

ఆయన తన చేతిలోనున్న గ్లాసునీళ్లని త్రాగుతూ నాకేసి వింతగా చూడసాగాడు. ఆ సమయంలో నా బుర్రలో ఏం తట్టిందో మరి? "ఏమండోయి! భోజనం కారియర్ తెచ్చేటప్పుడు ఒకబుడ్డి ఘాటు సారాయాన్ని కూడా తీసుకునిరావాలి. వెల ఎక్కువవుతుందని అనుమానించకుండా అక్కడ వున్న వాటిలో మేలురకం సామాను తీసుకుని రావాలి సుమా!" అని కిలకిలనవ్వుతూ పురమాయించాను—

నేను ఆడుతూవున్న నాటకాన్ని చూస్తూ ఆయన తికమకపడిపోతూ వున్నాడు. దానిని తెలియనీయకుండా వుంచటానికి ఎంతో ప్రయత్నంచేస్తూ వున్నాడు. దాన్ని పసికట్టుతూ

"ఎంత వెల అయినా సరే అదంతా ఒక లెక్కాపక్కా కాదు నాకు. ఇలాంటివాటికి నీళ్ళకిమల్లె ఖర్చుచేయటం నాకు మామూలే..." అని దర్జాగా అంటూ నావెంట తెచ్చుకున్న తోలుసంచిని తెరుస్తూ కొంచెం అట్టహాసం చేయటానికి మొదలెట్టాను. లోపల ఒక దమ్మిడీ రాగికానైనా వుంటేనా!... అయినా ఆ సంగతే ఆయనకి ఏదో రూపాన వెంటనే తెలపటం అవసరంగా!

"ఉన్న సంగతి మీకు ఇప్పుడే చెప్పివేయటం మంచిది. బోలెడు పని చూసుకోటానికి ఇక్కడికి వచ్చానని మీతో చెప్పింది పచ్చిఅబద్ధం. అసలు సంగతి ఏమంటే, ఇవ్వాళ మధ్యాహ్నం నా భార్యతో పెద్దపేచీ వచ్చింది. అంచేత ఆవిడ ముఖం రెండు మూడు వారాలు చూడకూడదని నిశ్చయించుకుని ఇలా

అజ్ఞాతవాసంలో వుండిపోవటానికి వచ్చాను. పేచీలు వచ్చినప్పుడు మన ఇంటివాళ్ళతో కొంచెం బెట్టు సరిగా వుండటం అన్నివిధాలా మంచిది కదండీ...” అని చిటికవేస్తూ అన్నాను. దాంతో ఆయన నిర్ఘాంతబోతూ ఎగాదిగా నాకేసి చూడటం గమనించాను. “అలా ఇదిగా నాకేసి చూడటం ఎందుకండీ? వున్నది వున్నట్లు చెప్పాను... మగవాడు కొంచెం బెట్టుసరిగా వుండకపోయాడా అంతా అవకతవక అయిపోతుంది... వాళ్ళకి లోకువ అయిపోతాం కూడా! ఏమంటారు? మన పరువు మర్యాదలను నిలుపబెట్టుకోటం అంత సులభం అని అనుకుంటున్నారా?” అని సూటిగా ఆయనకేసి చూస్తూ అడిగాను.

ఆయన కంగారుపడుతూ తల వూపాడు.

“మీరూ అర్థం చేసుకున్నందుకు సంతోషం. ఇలా చేస్తేనే వాళ్ళకి బుద్ధివస్తుంది. మనం గీసిన గీతలోనే వుండిపోవటానికి సిద్ధంగా వుంటారుకూడా!” అని కోయాలసిన కోతలని కోశాను ఆయన్ని దంగు చేయటానికి.

దానికీ అవునంటూ తల వూపాడు. కాని ఆ నిమిషంలోతటుక్కున ఆ చిన్నబుర్రలో ఏం తట్టిందో “మీరు చెప్పేదంతా బాగానే వుంది... కాని అడ్వాన్సు ఇయ్యంది మీరు మా ఇంట్లో వుండటానికి వీలులేదు. ఈ పేటలో వున్నవాళ్ళంతా బీదవాళ్లు, నేనూ వాళ్ళకిమల్లె పేదవాణ్ని... అంతదూరం ఎందుకండీ! ఆ హోటలునుంచి మీరు ఆర్డరిచ్చిన భోజనం, సారాయం తేవటానికే బోలెడంత డబ్బు అవుతుంది...” అని సణుక్కుంటూ ఏదో చెప్పబోతున్నాడు.

ఆయన ఇలా పానకంలో పుల్లవేయటం నాకు ససేమిరా నచ్చిందికాదు. “మీకు ఎప్పుడో చెప్పానుగా డబ్బు అనేది నాకు నీళ్ళప్రాయమని... మీకు ఎంత కావాలసివుంటుందో రేపు ప్రొద్దున్నే ఇచ్చివేస్తాను” అని దబాయిస్తూ అన్నాను. ఆ మాటనే మరికొంత గట్టిగా నొక్కుతూ —

“తొమ్మిది గంటలకు బ్యాంకు తెరుస్తారు. మీకు కావలసిన దానికన్నా రెట్టింపు మొత్తాన్నే పట్టుకుని వచ్చి మీ చేతికిస్తాను” అని ఆమాత్రం నాకు తెలియదా అన్నట్లు చూస్తూ దర్జాగా అన్నాను.

“మీరు చదువుకున్నవాళ్లు. భార్యమీద కోపం వచ్చిందని ఇలా మీ సొమ్మని దుబారా ఖర్చు చేయటం మీవంటి పెద్దమనుషులకి ఏమాత్రం సబబు కాదు...అయినా మీ విషయాల్లో నేనెందుకు కలుగచేసుకోవాలి?...” అని నసిగాడు.

“మీరు అన్నదే నిజం. కాని భార్య స్వభావం అటువంటిది. ఇంట్లోవాళ్ళతో, బయటివాళ్ళతో పేచీలు పెట్టుకోటం అంటే ఆవిడకి సరదా. ఇలాటి వాళ్ళని అదుపు ఆజ్ఞల్లో వుంచకపోయామా కొంపలు భగభగ మండిపోతాయి... ఆ రహస్యం తెలుసుకనే ఈ తతంగం పన్నాలసి వచ్చింది...” తడుముకోకుండా అంటూ గుక్కెడు నీళ్ళని గుటగుట త్రాగేశాను. ఇంకోసారి ఆయనకేసి ఆత్రంగా చూస్తూ “మీరు అనేదంతా అడ్వాన్సు వెంటనే కావాలనేగా! రేపు వుదయం సొమ్ము మీ చేతిలోకి వచ్చేదాక ఈ వుంగరాన్ని అడ్వాన్సుకోసం మీ దగ్గర వుంచుకోటానికి మీకేం అభ్యంతరం లేదనే అనుకుంటాను...” అని అంటూ వుంగరాలని రెంటిని తీసి బల్లమీద వుంచాను. వాటిలో సీలు వుంగరాన్ని తీసి ఆయనకు ఇయ్యబోయాను... దానికన్నా పెళ్లి వుంగరమే ఇయ్యటం బేషుగ్గా వుంటుందని చటుక్కున తట్టింది. దాన్నే తీసి ఆయన చేతికిచ్చాను. ఆయన దాన్ని పుచ్చుకుని తదేకంగా ఒకసారి చూశాడు.

“దీన్ని దగ్గర వుంచుకుని ఏం చెయ్యమంటారు? మేం కడుపేదవాళ్ళం. ఒకటి రెండు మార్కులు చేతిలో వుండటం తల!ప్రాణం తోకకి వచ్చినట్లంత!... మీకు ఎలాటి అభ్యంతరం లేకుండావుంటే నాకు బాగా తెలిసినాయన ఒకరు మా ఇంటికి సమీపాన్నే వున్నారు. ఆయన దగ్గర ఈ వుంగరాన్ని తాకట్టు పెట్టి కొంతసొమ్ము తెస్తాను. రేపు వుదయం మీరు బ్యాంకునుంచి సొమ్ము తెచ్చాక, వాళ్ళ సొమ్ము వాళ్ళకి ఇచ్చేసి, మన వస్తువుని మనం విడిపించుకోవచ్చు” అని రెప్పవాల్చకుండా వుంగరంకేసి చూస్తూ అన్నాడు.

“ఊఁ! అలాగే చెయ్యండి” అని భుజాలెగరవేస్తూ ఈపని “ఇంక ఏమాత్రం ఆలస్యం చేయకుండా దీన్నే చూసుకోటానికి వెళ్ళండి. ఎప్పుడు తిన్నానో ఇవ్వాళ? కడుపు భగభగ మండిపోతూ వుంది. దాంతో దాహం. వీటికి తట్టుకోలేక సతమతమైపోతున్నాను... ఇక చకచక వెళ్ళిరండి...” అని అన్నాను.

“ఇదిగో! ఈ క్షణంలో అదంతా చూసుకుని వస్తానుగా!” అని రాగాలుతీస్తూ మేడమీదినుంచి మరో క్షణంలో క్రిందికి వెళ్ళిపోయాడు....

ఏ గాలికి ఆ చాప నెత్తాలి! లేకపోయిందా ఈ మహానాటకమంతా తారుమారైపోతుంది.... ఈ రహస్యం బాల్యంనుంచి స్పష్టంగా తెలుసు. చిన్నప్పుడు నేనూ బీదవాణ్ణే. కలికానికైనా కాసు లేక సతమతమైపోతూ వుండేవాణ్ణి. కాని ఈ రహస్యం అవగాహన చేసుకోటంతోనే క్రిందిమెట్టునుంచి ఇంతపైకి గబగబ ఎక్కి రావటానికి ఎలాటి కష్టం కనిపించిందికాదు. ఇంతపైకి స్వశక్తితో వచ్చిన వాణ్ణి ముందుకి కూడా అలా సాహసంచేసి అడుగు వేయటానికి దమ్ములు లేకపోయాయా అంతా స్థంభించిపోతుంది. ఈ జీవితపు ప్రవంతిలో కనివిని ఎరగని దెబ్బ తినాలని వస్తుంది.

ఈ లోబెడాన్స్ చూడటానికి అమాయకుడుగా కనబడుతున్నాడు. కాని ఆయన లోపల ఏం వుందో ఎవళ్ళకి తెలుసు?... అంచేత అతని దగ్గర ఎంత బెట్టుసరిగా, ఎంత బిగువుతనాన్ని చూపిస్తూ వుంటే అంతమంచిది. ఈ ఆయుధాలు మన దగ్గర అస్తమానమూ వుండకపోతే ఇంకేం వుంది?...

# శ్రీ స్వామి కేశవయ్యాజీ బెంగుళూరు పర్యటన

స్వామి కేశవయ్యాజీ బెంగుళూరు పర్యటన సందర్భమున బెంగుళూరులో నవంబరు 1వ తేదినాడు కాఫీబోర్డు చైర్‌మన్ శ్రీ హెచ్. సీతారామరెడ్డి యింట్లోను, నవంబరు 5వ తేదినాడు అలంకార్ థియేటరు యజమాని శ్రీ జయంతిలాల్ యింట్లోను, షిమోగాలో 3వ తేది (వ్యాసపూర్ణిమ) నాడు జమిందారు శ్రీ A. R. అనంతరాం యింట్లోను, 4వ తేదీన శ్రీ A. R. బదరీనారాయణ్ యింట్లోను, పూజలు సలిపి విభూదిప్రసాదములను, తీర్థమును భక్తులకు పంచిపెట్టిరి. ఈ సందర్భమున అనేకమంది న్యాయవాదులు, డాక్టర్లు, ప్రభుత్వోన్నతోద్యోగులు, వ్యాపార ప్రముఖులు, మిల్లు యజమానులు, అనధికారులు, శాసనసభ్యులు అసంఖ్యాకముగా పాల్గొని శ్రీ సాయిబాబా అనుగ్రహ కటాక్షములకు పాత్రులైరి. స్వామీజీ శ్రీ సాయిబాబా మహిమను వివరించి భక్తివిశ్వాసములు గలవారిని నిరంతరము బాబా అనుగ్రహించి కాపాడునని చెప్పి, వ్యాధిగ్రస్తులకు, బాధలకు, కష్టములకు గురియగుచుండినవారికి విముక్తిమార్గములను సూచించిరి. తమ దివ్యదృష్టిద్వారా అనేకుల భవిష్యత్తునుకూడ తెలిపి తృప్తిపరచిరి.

ఆనందపురంలో అనేకమంది భక్తులు స్వామీజీకి స్వాగతమిచ్చిరి. భక్తులలో శ్రీ A. R. వెంకటాచల అయ్యంగారు, శ్రీ A. R. శ్రీనివాసన్ మున్నగువారు కలరు. వారందరు స్వామీజీ ఆశీస్సులను, విభూదిని పొందిరి.

స్వామీజీ పర్యటన భక్తులకు ఆత్మవిశ్వాసమును, మనశ్శాంతిని కలిగించి ఆధ్యాత్మిక, పారమార్థిక చింతలను ప్రబోధించినవి. శ్రీ బాబా అనుగ్రహ కటాక్షముల ద్వారా నిర్విరామముగా శ్రీ స్వామి కేశవయ్యాజీ మానవసేవ చేయుచుండుట మహా భాగ్యముగా యెంచదగును.

---

(574 వ పేజీ తరువాయి)

నీటి తెరలు యేర్పాటుచేయబడ్డాయి.

ఈవిధంగా దీపాలను అమర్చి, రోజుకు 14 గంటలపాటు వాటిని వెలిగించి ఉంచుతూ ఉండటంవల్ల అద్భుతమైన ఫలితాలు లభించాయి. ఇటువంటి పరిస్థితుల్లో నిమ్మచెట్లు ఒక్క సంవత్సరంలో దక్షిణ ప్రాంతంలో మూడు సంవత్సరాల్లో పెరిగేంత యెత్తుకు పెరిగాయి. ఇంతకంటే ఆసక్తిదాయకమైన విషయం యేమిటంటే టమాటా చెట్లు 60 రోజుల్లో పంటకు వచ్చాయి. ఒక్కొక్క దరపు మీటర్లోని మొక్కలకు 18 కిలోగ్రాముల టమాటాలు కాచాయి.

సైబీరియాలో పెద్ద జలవిద్యుత్ కేంద్రాలు నిర్మింపబడి విద్యుచ్ఛక్తి చవకగా లభించినప్పుడు యీ పద్ధతిని అక్కడ పంటలను పెద్దయెత్తున పండించటం సాధ్యమవుతుంది.

# గృహవైద్యము

## తులసి

మూలము : "గోసేవ"

మనం ముఖ్యంగా స్త్రీలు తులసిని పవిత్రమైనదిగా ఆరాధించి పూజించుచుండుట సహజము. శ్రీ మహావిష్ణువునకు అభిమానపాత్రము. తులసి యున్నచోట విష్ణువు సయితముండునని పురాణప్రసిద్ధము. అంతేకాక దీని వైద్యోపయోగములు అనేకము. ఇంకా తులసికి విషక్రిముల హరించు స్వభావము కలదు. అందుకని యింటిముందు వాకిలి కెదురుగా తులసికోట నమర్చుదురు. దానివలన సర్పాదులులాంటి విష క్రిములు యింటిలోకి చొరవని నమ్మకము. తులసిచెట్లపైనుండి వీచుగాలి, వాని స్పర్శ దీర్ఘాయురారోగ్యము లను పెంపుజేయునని ప్రతీతి. వైద్యులు, రసాయనశాస్త్రజ్ఞులు తులసివనమున నుంచబడిన శవము ఎంతకాల ముండినను చెడిపోదని అభిప్రాయపడెదరు. శవదహనమునకు సయితము తులసి సమిధలు, కలపను మహో త్కృష్టమైనవిగా నుపయోగింతురు.

కృష్ణతులసి, లక్ష్మితులసి సమానముగా వైద్యవిలువ కలవైనా కృష్ణతులసి మేలైన గుణము నిచ్చునని అనుభవవిదితము. కృష్ణతులసి ఆకులు, కాడలు కొంచము నల్లని వర్ణము కలిగియుండును. లక్ష్మితులసి తెల్లని వర్ణము కలది.

గృహవైద్యమునందు తులసి అనేక విధములుగా నుపయోగపడును.

తులసి ఆకురసము జలుబు, దగ్గు మొదలైన శీతల వ్యాధులను కుదుర్చును. పడిశభారమును తగ్గించును. పసిపాపలకు కస్తూరి మాత్రలను వాడునప్పుడు తులసి ఆకు రసమును అనుపానముగా నిచ్చిన త్వరగా గుణ మిచ్చును. తులసి ఆకు రసముతో తేనె కలిపి యిచ్చిన దగ్గు, జలుబు, గొంతులో గొరగొరలు నిమ్మ ళించును. జలుబుచేసి ముక్కునుండి శ్లేష్మము పడుచుండిన తులసి ఆకురసము, అడ్డసరము కలిపి యిచ్చిన తగ్గును.

కడుపులోని వాతము హరించి, ఆప్యాయము ఏర్పడుటకు తులసి ఆకుల రసము మంచిది.

తులసి ఆకురసము జ్వర ఉధృతము తగ్గించును. తులసివేరు కషాయము విడువని జ్వరములను, మన్యపు జ్వరములకు యితర జ్వరములను కుదుర్చును.

పసిపాపల కడుపునొప్పి నివారణకు తులసి ఆకురసమును అల్లము రసముతోగాని, శొంఠి పాలతో గాని కలిపి యిచ్చిన తగ్గును. తులసి ఆకురసము పసిబిడ్డల కడుపులోని వ్యాధులను నయముచేసి బలమును చేకూర్చును.

తామరలాంటి చర్మవ్యాధులు తులసి ఆకులను నిమ్మకాయరసంతో నూరి పూసిన నివారణయగును. ఆకులను నూరి వ్రణములకు కట్టిన అందలి క్రిములు నశించి త్వరగా మానును.

తులసి ఆకు రసమునందు తేనె కలిపి నేత్రముల కంజనముగా వాడిన నేత్ర రోగములు నయమగును.

వెల్లుల్లి, తులసి ఆకు రసములనుచెవిలో పోసిన కర్ణరోగములు నయము కాగలవు. ముఖ్యంగా చెవిపోటు నకు తులసి ఆకురసము వాడకం మంచిది.

కంటిలోని పొరలకు తులసి ఆకురసములో మోదుగగింజను భావనచేసి దానిని నూరి కంటికి కాటుకగా వాడినచో మంచి గుణమిచ్చును.

తులసి పువ్వు, వెన్నులు, శొంఠి నూరి ఆ రసంలో తేనె, నీరుల్లిపాయ రసము కలిపి యిచ్చిన పాము విషము విరిగిపోవును.

తులసిచెట్టు వేరుతో తేలు కుట్టినచోట పలుమారు రుద్దినచో విషము హరించును.

బాలలకు విరేచనకారియై, పైత్యం యిత్యాది జబ్బులను తులసి ఆకురసము నయముచేయును.

తులసి గింజలు మూత్రము సాఫీగా జారీయగుటకు తోడ్పడును.

# మెట్రిక్ తూకాలు
# నేటినుండి నిర్బంధంగా అమలు

1960 అక్టోబరు 1 వ తేదీ నుండి యీ దిగువ పేర్కొనబడిన ప్రాంతాలలో అన్ని వ్యాపారవ్యవహారాలలోను మెట్రిక్ తూకాలను మాత్రమే వుపయోగించాలి. మెట్రిక్ వాణిజ్య తూకపు రాళ్ళన్నిటిపైన అధికార ముద్రవుండాలి. ఇంకే తూకాలను వుపయోగించినా, చట్ట విరుద్ధంకాగలదు.

**ఆంధ్ర ప్రదేశ్ :** విశాఖపట్టణం, కృష్ణా, గుంటూరు, కర్నూలు, హైదరాబాదు, వరంగల్లు, నిజామాబాద్ జిల్లాలు, రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

**అస్సాం :** నౌగాంగ్ జిల్లా, గౌహాతీ నగరం.

**బీహారు :** భాగల్పూర్, రాంచి డివిజన్లు; పాట్నా, తిర్హుట్ డివిజన్లలోని మునిసిపల్; నిర్దేశిత ప్రాంతాలు.

**గుజరాత్ :** అహ్మదాబాద్, రాజ్‌కోట్, బరోడా నగరాలు, రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

**కేరళ :** కోజికోడ్, ఎర్నాకులం, క్విలన్ జిల్లాలు.

**మధ్యప్రదేశ్ :** సెహోర్, ఇండోర్, గ్వాలియర్, జబ్బల్పూర్, జిల్లాలు; రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లలోను.

**మద్రాసు :** మద్రాసు, చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాటు, ఉత్తర ఆర్కాటు జిల్లాలు; రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

**మహారాష్ట్ర :** బొంబాయి, పూనా, నాగపూరు ఔరంగాబాదు, షోలాపూరు, అకోలా, అమరావతి, వర్ధా, యోత్మల్ నగరాలు; రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

**మైసూరు :** బెంగుళూరు, రాయచూరు, ధార్వార్ జిల్లాలు; రాష్ట్రంలో అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

**ఒరిస్సా :** బరంపురం, కటకం, సంబల్పూర్ నగరాలు.

**పంజాబు :** అమృత్‌సర్, జలంధర్, లూధియానా, అంబాలా, పాటియాలా, గుర్గాం జిల్లాలు; రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు

**రాజస్థాన్ :** అజ్మీర్, బికనీర్, జోధ్పూరు, జైపూరు, కోటా, ఉదయపూర్ జిల్లాలు.

**ఉత్తర ప్రదేశ్ :** మీరట్, ఆగ్రా, లక్నో, బెరిల్లీ, మొరాదాబాద్, వారణాసి, కాన్పూరు, ఝాన్సీ, అలహాబాద్, గోరక్‌పూర్ నగరాలు

**పశ్చిమ బెంగాలు :** కలకత్తా, హౌరా మునిసిపల్ ప్రాంతాలు.

**ఢిల్లీ :** ఢిల్లీ అంతటా.

**హిమాచల్ ప్రదేశ్ :** మండీ, సిర్మూర్ జిల్లాలు.

**మణిపూరు :** ఇంఫాల్ నగరం.

**త్రిపుర :** అగర్తలా నగరం

**అండమాన్, నికోబార్ దీవులు :** పోర్ట్ బ్లెయర్ నగరం.

**పుదుచ్చేరి :** పుదుచ్చేరి అంతటా.



ఈ దిగువ పేర్కొనబడిన వ్యాపారాలు, పరిశ్రమలలో అన్ని వ్యవహారాలలోను మెట్రిక్ పద్ధతి తూకాలను కొలతలను విధిగా వుపయోగించాలి :

జనుపనార, నూలు వస్త్రాలు, ఇనుము, ఉక్కు, ఇంజనీరింగు, భారీ రసాయనాలు, సిమెంటు, ఉప్పు కాగితం, రిఫ్రాక్టరీస్, 'నాన్ – ఫెర్రస్' లోహాలు, రబ్బరు పరిశ్రమలు, వనస్పతి, సబ్బు, ఉన్నివస్తువులు, ప్రత్తి ఫార్వర్డు మార్కెట్ల కంట్రోలు, కాఫీబోర్డు వ్యవహారాలు

# మెట్రిక్ పద్ధతి

**అంతటా ఒకే పద్ధతి – ఎంతో సులభమైనది.**

భారతప్రభుత్వం వారిచే జారీ చేయబడింది

DA 60/409

# కృత్రిమపు వెలుగులో మొక్కల పెంపకం

ప్రొఫెసర్ బి. మొష్కోవ్

సూర్యుని వెలుగులోనేగాక, మామూలు ఎలక్ట్రిక్ బల్బుకు చెందిన కృత్రిమపు వెలుగులో కూడా మొక్కలను పెంచవచ్చునని కొంతకాలం క్రితం అనివుంటే అది విపరీతమైన విషయంగా భావింపబడి ఉండేది.

కాని చాలాకాలంగా లెనిన్‌గ్రాడ్ వ్యవసాయ పరిశోధనా సంస్థ మొక్కల పెరుగుదలపైన ఎలక్ట్రిక్ వెలుగుయొక్క ప్రభావాన్ని గురించి పరిశోధనలను జరుపుతున్నది. ఈ పరిశోధనలలో ఆశాజనకమైన ఫలితాలు చాలాకాలం క్రితమే లభించినప్పటికీ, ఎలక్ట్రిక్ వెలుగులో తోటలను పెంచవచ్చునన్న విషయం యీ మధ్యనే గట్టిగా నిర్ధారణ అయింది.

సూర్యరశ్మి మారే స్వభావాన్ని కలిగి ఉంటుంది. కొన్నిరకాల మొక్కలకు మిట్ట మధ్యాహ్నపు సూర్యరశ్మి కొంత చీకాకును కల్పిస్తుంది. అంతేగాక, పొగమంచు ఉన్న సమయాల్లో యీ మొక్కలకే సూర్యరశ్మి సరిపోదు. సరియైన వెలుగు లభించకపోవటంవల్ల మొక్కలు కాపుకు రావటం ఆలస్యమవుతుంది. పంట కూడా తక్కువగా ఉంటుంది. సోవియట్ దేశం దక్షిణ ప్రాంతానికి చెందిన మొక్కలు ఉత్తర ప్రాంతాల్లో పెంచబడినప్పుడు అక్కడి వాతావరణానికి అలవాటుపడినా, అక్కడి దీర్ఘకాలపు పగళ్లమూలంగా సరిగ్గా కాపుకురావు. అదేవిధంగా ఉత్తర ప్రాంతానికి చెందిన మొక్కలు దక్షిణ ప్రాంతంలో పెంచబడినప్పుడు అవికూడా దక్షిణప్రాంతపు వాతావరణానికి అలవాటు పడినప్పటికీ అక్కడి హ్రస్వకాలపు పగళ్ళవల్ల బాగా కాపుకురావు. ఉదాహరణకు లెనిన్‌గ్రాడ్ మండలంలో వాటంతటవిగా పెరిగే రాస్ప్‌బెరీ పండ్ల చెట్లూ, విల్లో మొదలైన పూలచెట్లూ కాసేసస్ నల్ల సముద్రతీరంలో సుఖుమీలో వేయబడినప్పుడు అక్కడి హ్రస్వకాలపు పగళ్లమూలంగా సరిగ్గా పెరగనేలేదు. జూలై మాసంలోనే వాటి ఆకులు రాలిపోతుంటాయి. కాని సుఖుమీలో పెంచబడుతున్న అటువంటి మొక్కలపైన సూర్యాస్తమయం తర్వాత ఎలక్ట్రిక్ దీపాలను వెలిగించి 6–10 గంటలపాటు ఉంచినట్లయితే, అవి మామూలుగా పెరుగుతాయి. ఉత్తర ప్రాంతంలో పెరిగే దానికంటే ఇంకా ఎక్కువగా కూడా పెరుగుతాయి.

గత కొద్ది మాసాలుగా లెనిన్‌గ్రాడ్ వ్యవసాయ పరిశోధనాసంస్థ అద్దపు ఎలక్ట్రిక్ దీపాలతో ఆసక్తిదాయకమైన పరిశోధనలను జరుపుతున్నది. ఈ అద్దపు ఎలక్ట్రిక్ దీపాలు మరింత ఉత్తమమైన ఫలితాల నిచ్చాయి. సహజమైన వెలుగు చొరని చీకటిప్రాంతాల్లో మొక్కలు పెంచబడ్డాయి. అద్దపు ఎలక్ట్రిక్ దీపాల ద్వారా మాత్రమే వాటికి వెలుగు వేడి లభింపజేయబడ్డాయి. ప్రసరింపబడే వేడి తరంగాలలోని కొన్ని "ఇన్‌ఫ్రారెడ్" వేడితరంగాలనుపీల్చుకోటానికి పారదర్శకపు

(571వ పేజీ చూడుడు)




**ప్రసన్నాంజనేయము :** విద్వాన్ తిరువాయి రాఘవసూరి, 3, సాంబశివరెడ్డి వీధి, పెరవళ్ళూరు, మద్రాసు–11. వెల 1 రూపాయి.

వాల్మీకి రామాయణంలోని సుందరకాండము మనోజ్ఞమైనది, అనుదిన పారాయణార్హంబు, అభీష్ట ఫలప్రదంబు అని ప్రతీతి. దీనిని గ్రంథకర్త ఆధారముగా గైకొని ప్రసన్నాంజనేయముగా ఆంధ్రమున రూపొందించినాడు. ఇది సామాన్య పాఠకులతో బాటు విద్యార్థుల కుపయుక్తముగా నుండునట్లు తేటగీతము లలో రచింపబడినది.

నిరంతరము భగవత్కైంకర్యముపట్ల ఆసక్తితో దాసానుదాసుడై నిరంతరము శ్రీరాముని సేవించిన మహాభక్తుడు శ్రీ ఆంజనేయుని ప్రభావము, స్వామికార్యతత్పరత్వము సుందరాకాండములోని ప్రధానాంశ ములు. పరమాత్మకు ఆత్మార్పణము చేయుట అన నేదో యిందు ప్రబోధించబడినది. అభీష్టఫలసిద్ధికి సుందరా కాండ పారాయణం తప్పక తోడ్పడునని అనేకుల నమ్మకం కాబట్టి యీ ప్రసన్నాంజనేయ గ్రంథపఠనము రక్తిముక్తిదాయకమగునని చెప్ప సాహసించుచున్నాము. విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నుండతగినది కూడాను,

**స్తోత్రమంజరి :** ప్రచురణ కర్తలు – ఆర్షవిజ్ఞాన ప్రచారక సమితి, కాకరపర్రు, ప. గోదావరి జిల్లా.

ఇందులో శ్రీ గణేశాష్టకం, గాయత్ర్యష్టకం, ఈశ్వరకృత శ్రీరామస్తుతి, చంద్రశేఖరాష్టకం, ఆంజ నేయస్తుతి కలవు. భగవదనుగ్రహ కటాక్షములకు పాత్రులగుటకు యీ స్తోత్రమంజరి పఠనం తోడ్పడగలదు.

**కావ్యలక్ష్మి :** కీ॥ శే॥ మంత్రవాది సుబ్రహ్మణ్యంగారు. తరుణసాహితి, ఆల మూరు, తూ. గోదావరి జిల్లా. వెల 1 రూపాయి.

ఈ ఖండకావ్య సంపుటిలోని శీర్షికలు మృదుమధురమైన శైలిలో విశేషమైన భావసంపదతో రాణించుచున్నవి. ఇందలి పద్యములు ప్రబోధాత్మకంగాను, విజ్ఞాన ఆసక్తులను పెంపొందజేయునవిగా నుండి పాఠకులను ఉల్లాసపరచునవిగా నున్నవి. ఇందలి వర్ణనలు, భావముల పొందిక, వాస్తవికతచిత్రణ, ప్రబోధము బాగున్నవి.

♦ ♦ ♦ ♦

ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేద మహామండలి వైజ్ఞానిక సంచిక 'వైద్యశ్రీ' మా కార్యాలయమునకు చేరి నది. దీని వెల 3 రూపాయలు. సంపాదకుడు వైద్యశ్రీ ప్రకాశచంద్ర శతపథి. ప్రచురణకర్తలు – ఆంధ్ర ప్రదేశ్ ఆయుర్వేద మహామండలి (రిజిస్టర్డు), గూడవల్లివారి వీధి, గవర్నర్ పేట, విజయవాడ – 2.

ఈ సంచికను రూపొందించడంలో సంపాదకులు అపారమైన కృషిచేసియుండాలి. ఇందులో ఆయు ర్వేద శాస్త్రౌన్నత్యమును నిరూపించుటయేకాక శ్రుతి, స్మృతి, ఉపనిషదు, పురాణ, ఉపపురాణ, కావ్యా దులలో గల అమూల్యమైన ఆయుర్వేద విషయములు వివరించబడినవి.

ముఖ్యంగా ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులచరిత్ర, ఫొటోలతో బాటు అనేకుల అమూల్యమైన వ్యాసములు యీ సంచికను బహుళోపయుక్తంగా చేసినవి. ఆయుర్వేద వైద్యవిధాన విశిష్టతను నిరూపించ జరుగుచున్న కృషికి యీ సంచిక తోడ్పడడమే కాక, దేశీయ వైద్యవిజ్ఞానమునకు మహో జ్జ్వలమైన భవిష్యత్తును ప్రోత్సహించునని ఆశిస్తున్నాము.

# సంపాదకీయములు

## పండిత నెహ్రూ వర్ధిల్లాలి!

పండిత జవహర్లాల్ నెహ్రూ భారత ప్రధాని మాత్రం కాదు; ప్రపంచ శాంతి దూతలలో ప్రముఖుడు. ప్రపంచ సౌభాగ్యాన్ని, కళ్యాణాన్ని తీర్చిదిద్దాలనే సంకల్పంతో నిరంతరం జాతీయ, అంతర్జాతీయ రంగాలలో నిర్విరామంగా కృషిచేయుచున్న నాయకుడు. వాస్తవికత నుద్దేశించి ప్రపంచ సౌభాగ్యాన్నుద్దేశించు ప్రతి దేశము, ప్రజలు పండిత నెహ్రూను అభినందించి ఆయనకు జోహారులర్పిస్తున్నారు. ఆయన విశిష్ట నాయకత్వము మన జాతికి లభించడము మహదావకాశమని చెప్పాలి.

మన దేశంయొక్క కీర్తిప్రతిష్టలకు పండిత నెహ్రూ అంతర్జాతీయ రంగంలో ప్రతిబింబములాంటివాడు. ఆయన దూరదృష్టి, చిత్తశుద్ధి, ప్రజాభ్యుదయముపట్ల ఆసక్తి, వాస్తవిక పరిజ్ఞానము, త్యాగసేవాసక్తి, ధైర్య సాహసాలు యీనాడు ఆనాడుకూడ ప్రజలను అభివృద్ధి అభ్యుదయాలవైపు పురోగమింపచేస్తున్నవి. జాతీయ నాయకత్వంయొక్క విశిష్టతకు, సాధించిన ఘనవిజయాలకు పండిత నెహ్రూ వ్యక్తిత్వము విశేషంగా తోడ్పడింది. ఇట్టి మన నాయకాగ్రణియొక్క మరొక జన్మదినోత్సవాన్ని యీ నెల 14-వ తేదీన యావద్భారత దేశం జరుపుకుంటున్నది.

ముఖ్యంగా పండిత నెహ్రూ జన్మదినం బాలలకు పర్వదినం. బాలల ఆశీస్సులు భగవంతుని ఆశీస్సులనడం సహజం. ఈనాటి బాలలు రేపు పౌరులు కానున్నారు కాబట్టి జాతీయ సౌభాగ్యం వారిపై నాధారపడియుండునది. బాలల అభివృద్ధి అభ్యుదయాలపట్ల ఆసక్తి విశేషము కాబట్టి బాలలకు పండిత నెహ్రూపట్ల ఆదరప్రేమాభిమానాలు అత్యధికము. పండిత నెహ్రూ జన్మదినోత్సవం "పండిత నెహ్రూ వర్ధిల్లాలి!" అనే నినాదాల మధ్య ఆనందోత్సాహాలతో జరుగడం ఆయన కలకాలము ఆయురారోగ్యాలతో వర్ధిల్లి జాతీయ నాయకత్వమును వహించగలరను భగవంతుని ఆశీస్సులకు చిహ్నంగా భావింతముగాక!

## అమెరికా అధ్యక్షుడుగా జాన్ కెన్నెడీ విజయం

అమెరికా అధ్యక్షపదవికి జరిగిన ఎన్నికలలో డెమోక్రాటిక్ పార్టీ అభ్యర్థి జాన్ కెన్నెడీకి అఖండ విజయం చేకూరింది.

జాన్ కెన్నెడీ యువకుడు. ప్రపంచ శాంతి సౌభాగ్యములపట్ల అత్యంత ఆసక్తి కలవాడు. ఆయన వాస్తవిక పరిజ్ఞానము ప్రపంచములో సుస్థిరమైన శాంతి అభ్యుదయాలను సాధించగలదని వివిధ దేశాల ప్రజలు ఆశించడంలో అబ్బురపాటేమియు లేదు.

ముఖ్యంగా అమెరికాయొక్క అండదండలు డెమోక్రాట్ల నాయకత్వంలో మరింతగా ఇండియాకు లభించగలవనియు, జాన్ కెన్నెడీ ఇండియా మిత్రుడు కావడం చాల సంతోషింపతగిన విషయమనియు యూహిస్తున్నాము.

జాన్ కెన్నెడీని హృదయపూర్వకంగా నభినందిస్తూ భగవంతుడు ఆయనకు ఆయురారోగ్యాలను సమకూర్చునట్లు ప్రార్థిస్తున్నాము.

---

## ముఖచిత్రము

కుమారి గీత, కీ॥ శే॥ కే. జి. మీనన్ I. C. S. గారి కుమార్తె. సాంప్రదాయ సిద్ధమైన భరత నాట్యమును అభ్యసించి 28-8-58 న మ్యూజియం థియేటరులో మొదటిసారి అరంగేట్రం జరిపి పెద్దల ఆశీస్సులకు, అభినందనలకు పాత్రమైంది. దరిమిలా అలవడిన చక్కని ప్రజ్ఞా ప్రావీణ్యములతో యీమె డిశంబరు 10 వ తేదినాడు దక్షిణ రైల్వే కేరళకళా సమితివారి యాజమాన్యమున భరత నాట్యమును ప్రదర్శింపనున్నది.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

60
సంవత్సరాలుగా
స్త్రీ జనులతో
సన్నిహిత
బాంధవ్యము
కలది




లోధ్ర

స్త్రీల ఆరోగ్య
సౌభాగ్యములకు

కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14.

SISTA'S